JAGATI Rs. 2-00 February 1992

37th Year of Publication




427

ఫిబ్రవరి - 1992

## సాహితీ సుధ

నలువ కులాలు భంగి నలిన ప్రభవాంకము నలదు దేనిచే
నిలిచె దశావతార వన నిష్ఠతుడయ్యె మురారి దేనిచే
బెలుచ గపాల హస్తుడయి భిక్షకుడయ్యె బురారి దేనిచే
నల రవి దేనిచే దిరుగు నా ఘనకర్మము వంద్యమే కదా

—భర్తృహరి

కుల్లా యుంచితి, కోక గట్టితి, మహా కుర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్, తిలపిష్టమున్, మెసవితిన్, విశ్వస్త వడ్డింపగా!
చల్లాయంబలి ద్రావితిన్, రుచులు దోసంబంచు పోరాడితిన్
తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా! నేను శ్రీనాధుడన్

—శ్రీనాధుడు

మట్టి ఘటములోన బెట్టిన జీవుని - గానలేక నరుడు కాశి కేగ
వెదకి వెదకి తుదని వెఱ్ఱియై చెడిపోవు - విశ్వదాభిరామ వినుర వేమ

—వేమన



'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : రాష్ట్రపతి వెంకట్రామన్

# నవ్వులు

బిఏ పాసైన రాజశేఖరం, కొత్తగా పెట్టిన కంపెనీలో క్లర్క్‌పోస్ట్‌కి అప్లయి చేశాడు. అదృష్టం బావుండి ఇంటర్వ్యూ కార్డు వచ్చింది.

ఇంటర్వ్యూ చేస్తున్న ఆఫీసరు, రాజశేఖరంతో అన్నాడు : 'ఈ ఉద్యోగం చేయాలంటే, నీకు చాలా ఓపిక కావాలి ; ఎంతో సహనం వుండాలి ; ఎదురు ప్రశ్నలు వేయకుండా చెప్పినట్టు చేయాలి'

'టెంపరరీగా యిచ్చి చూడండి, మీకే తెలుస్తుంది, నేనెంతటి సహనమంతుణ్ణో!' - అని విన్నవించుకున్నాడు రాజశేఖరం.

'నీ సహనం గురించి నీవే చెప్పుకుంటున్నావ్ - అది మేము చెప్పాలి.' - అన్నాడు ఆఫీసరు.

'అఖ్ఖర్లేదండి - నేను పెళ్లయినవాణ్ణి'

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

రచయిత నిత్యానందం కుర్చీలో సిమిత పడాక, ఎడిటర్‌గారన్నారు : 'మీరేదో తెలిసినవారు కదా - ప్రారంభంలో నవల బావుందికదా - మిగతాది వారం పదిరోజులలో పంపుతానన్నారని మొదలు పెట్టినందుకు భలే పని చేశారే !'

'పంపింపాను కదండీ మిగతాది. వారం వారం పాఠకులు ఎలా మెచ్చుకుంటున్నదీ మీరు లేఖలు వేస్తూనే వున్నారు' - అన్నాడు నిత్యానందం.

'మెచ్చుకున్నవి గాక దుయ్యబట్టేవి వేస్తామటండీ - అది మాకే తలవంపు. అటువంటి రచన మా నెత్తిని ఎందుకు రుద్దుతున్నారని పాఠకులు నిలువదీయరూ ? అందుకని బావుందన్నవి అచ్చు వేస్తాం. నా పాయింట్ అది కాదు. అలా అర్ధాంతరంగా ముగించి, మిగతాది పాఠకులకు ఊహకు వొదిలేస్తున్నానన్నారేమిటి ? అదేమి ముగింపండీ ?' - అడిగారు ఎడిటర్.

'అదొక కొత్త పద్ధతి - నాకు దొరికిన ఇంగ్లీషు పుస్తకంలో మిగతా పేజీలు లేవు.'

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

రాంబాబూ, నీకు ఈ జన్మలో లెఖ్ఖలు రావు - అన్నాడు టీచరు.

'నిజంగానాండీ ?'

'ఎందుకలా అడుగుతున్నావ్'

'గొప్పవాళ్లెవరికీ లెఖ్ఖలు రావని మానాన్న అంటూంటాడు....'

'ఇంత చిన్న లెఖ్ఖ చేయలేని నీ బతుక్కి గొప్పవాడవటం కూడానా ?'

'నేను కాదు, సార్, మా నాన్న గొప్పవాడు - ఆ లెఖ్క వేసింది ఆయనేగా !'

—జె హేమలత
కాకినాడ-3

అష్టదిగ్గజాల రోజులు కావు గనక, కనీసం ఆస్థాన పదవులైనా నెలకొల్పాలని మంత్రిగారి సంకల్పం. ఆ విధంగానే ఏర్పాటు చేశారు. ఒక రోజున పొరుగు రాష్ట్రపు మంత్రి వచ్చినప్పుడు ఈ ఆస్థాన పదవీ భూషితులని రప్పించాడు.

'మేము మా రాష్ట్రంలో ఎన్నో మార్పులు చేశాము - చేస్తున్నాము,' అన్నారు మంత్రిగారు.

'మేమూ చేస్తున్నాం - మార్పులు చేయనిదే ప్రజలు ఊరుకోరు. కనీసం ఊళ్ళ పేర్లయినా మార్చాలి.... మీరు ఏఏ రంగాలలో మార్పులకు పూను కున్నారు ?' - అని పొరుగు రాష్ట్రపు మంత్రి అడిగారు.

'ఆస్థాన పదవులు ప్రవేశపెట్టాం'

'చాలా మంచిపని చేశారు గత కాలపు వైభవం గుర్తు చేసేందుకు అదొక మార్గం.'

'ఈయన మా ఆస్థాన కవి - మేము నిర్వహిస్తున్న అభివృద్ధి కార్యక్రమాలను తన పద్యాలూ పాటలూతో ప్రజలలోకి పట్టుకుపోతారు'

ఒకాయన తన కుర్చీలో నుంచి నిలబడి నమస్కారం చేసి మళ్లీ కూచున్నాడు.

'ఈయన మా ఆస్థాన సంగీత విద్వాంసుడు .... ఆస్థాన నాట్యాచార్యుడు .. ఈయన మా ఆస్థాన రౌడీ....'

—పి కుసుమకుమారి
హైదరాబాదు-45

---

పన్నెండుగురు వివేకవంతులు ఒక గంటలో చెప్పలేనన్ని ప్రశ్నలు ఒక మూర్ఖుడు నిమిషంలో అడగగలడు.

—లెనిన్

మనం ఎక్కువ వృథా చేసేది టైము. — వాల్టైర్

---

## పాఠకుల లేఖలు

చందూర్ దంపతులకు : మీ 'జ గ తి' మాకందరికీ జగతిగా ఉంటున్నది. అరవై ఒక్క సంవత్స రాల క్రితం మీ మద్రాసును వదిలి తిమి మా దంపతులం. మీ 'జగతి' తిరిగీ ఆ మద్రాసు ఆ నాటి గద్దె రంగయ్య, దేశోద్ధారక నాగేశ్వరరావు, వెంకన్న, దుర్గాబాయమ్మ లాగ, ఈ నాడు బియిస్ ఆర్ కృష్ణ, సత్యనారా యణ ద్వయం, మరెందరో కావలసిన వారు వున్నారని హెచ్చరిస్తున్నది.... నవ్యాంధ్ర వచనానికి ఆది పురుషులు శ్రీ వీరేశలింగమైతే, ఆ సాహిత్యానికి క్రొత్త మలుపు తెచ్చిన శ్రీ వున్నవ, మా కెందరికో యిల దేవత! ఆయన్ను పూజించు మా మిత్రులు డా॥ సత్యనారాయణ పల్కులను మాకు అందించినది మీ 'జ గ తి'. శ్రీ లక్ష్మినారాయణగారి 'మాలపల్లి' నాకూ, 'నాయకురాలు' భారతీదేవికి ప్రాణప్రదము. మన ప్రధాని నర సింహారావు గారు ఆఫ్రికా వారి 'హరార'లో యెంత అందంగా దాక్షి ణాత్య భారతీయుల కండువా ధరిం చారో గమనించారా టి. వి.లో ?.... ఎందరినో తలచుకునేటట్లు చేస్తున్నది 'జ గ తి'

—యన్ జి రంగా
న్యూఢిల్లీ

చందూర్‌గారికి నమస్కారములు. ప్రతినెలా 'జ గ తి' పత్రిక ఒక ఆనంద వీచికలా మమ్మల్ని పల్క రిస్తోంది. కారణజన్ములైన మీరిద్దరూ ఎందరి జీవితాలలో తీర్చి దిద్దుతున్నారు. హృదయ పూర్వక ధన్య వాదాలతో...

—ఉషారాప్
బొంబయి-77

ఉభయ చందూర్‌గార్లకు నమస్సు మాంజలులు. ముఖిలో పుట్టి పుబ్బలో మాడిపోయే చందాన కాక, మూడు పుష్కరాల సాఫీ జీవితాన్ని గడపి, నాలుగవ పుష్కరంలో ప్రవేశించిన 'జ గ తి'కి మా అభినందనలు. సినీ పనోరమాను వినూత్నరీతిలో, అద్దం పట్టినట్టు మా కళ్ల ముందుంచారు.

—మండల రామారావు
తలగడ దీవి

శ్రీ యన్.ఆర్. చందూర్‌గారికి : నమస్కారం. 'నా రాట్నచక్రం' ద్వారా విస్మృత దేశభక్తులు తల్లా ప్రగడ ప్రకాశరాయుడు గారి సేవా నిరతిని, త్యాగాన్ని ఈ నాటి వారికి అందచేయటం అత్యంత సముచితం - అభినందనీయం. శుభం

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి
కడప - 4

## వెన్నెల తేటతూలు

## శత జయంతి

ఆర్థిక శాస్త్రవేత్తగా, చరిత్ర తత్వవేత్తగా, రాజనీతి విశారదునిగా, గురువులకే గురువుగా భాసిల్లినారు ఆచార్యజీ. ప్రముఖ విద్యావేత్తగా, స్వాతంత్ర్య సమర యోధునిగా, సంఘసంస్కర్తగా విలసిల్లినారు మామిడిపూడి వారు. ఉత్తమ కళాశాలాధ్యక్షుడిగా, అనుపమ ఆచార్యునిగా సుబోధనా పటిమ గల అధ్యాపకునిగా, జీవితాంతం విద్యారంగాభివృద్ధికై పాటు పడిన కృషీవలునిగ, విద్యార్థులకు, అధ్యాపకులకు ఆదర్శప్రాయంగా వెలుగొందినారు వెంకటరంగయ్యగారు. సహకారోద్యమ స్రష్టగా, పత్రికా సంపాదకునిగా అసంఖ్యాక వ్యాసకర్తగా, బహుగ్రంథ కర్తగా, గ్రంథ విమర్శకునిగా, కుల మతరహిత విశాల హృదయ శీలిగా వికసించిన 'పద్మ భూషణులు'. రెండున్నర దశాబ్దాలు వివిధాంశాలపై జ్ఞానార్థుల సందేహాలను నివృత్తి చేసిన జ్ఞానఖని. తన పదునైన కలాన్ని పదిమంది ప్రయోజనం కొరకు ప్రయోగించిన సార్థక జీవి.

—సంపాదకీయం
'తెలుగు విద్యార్థి'

## విజయ బాపినీడు

పరిస్థితులు నెట్టుకు వస్తే దర్శకత్వం చేపట్టవలసి వచ్చింది విజయ బాపినీడు. మొదటి రోజు సెట్ మీదకు వచ్చేదాకా హీరో చిరంజీవికి తెలియదు నిర్మాత, దర్శకుడు కానున్నారని. "అయినా తమాయించుకొని నన్ను ప్రోత్సహించారు చిరంజీవి. నాకే కాదు కెమెరా రఘుకు. రచయిత ఆకెళ్లకూ అది తొలి చిత్రం" అంటారు విజయ బాపినీడు. అసలు మౌళి చేయవలసింది 'మగ మహారాజు' - ఆయన తమిళంలో బిజీ అయిపోయి, 'డేట్స్' సమస్య రావటంతో తప్పనిసరి పరిస్థితుల్లో డైరెక్టర్ కావలసి వచ్చింది. సినిమా చరిత్రలో ఇలాటి నివ్వెరపాటు కలిగించే సంఘటనలు అరుదుగా జరుగుతూనే ఉంటాయి. మేక్ సెన్నెట్‌ను డైరెక్టర్‌గా చిత్రం తీద్దామనుకొంటే – వీలుపడక, విధిలేక 'స్టార్ట్', 'కట్' రెండు మాటలను నేర్చుకొని జగద్విఖ్యాత దర్శకుడయ్యారు సిసిల్, బి. డియల్.... చిత్రం తీయటం ఒక ఎత్తు, కొత్త రీతుల్లో పబ్లిసిటీ ఇచ్చి ప్రాణాలు పోయటం ఒక ఎత్తు.

—వ్యాస భాగం
'మూవీ మార్కెట్'

# పాతికేళ్ల నాటి పిక్చర్

## వాహినీ వారి
## 'రంగుల రాట్నం'

వాహినీ చిత్రాలు ఆది నుంచీ ప్రత్యేకత గలవి ; ఆ ప్రత్యేకత నిల బెట్టుకుంటున్నాయి. ఎన్నికలను హాస్య వలయంలో యిరికించి, అన్నదమ్ము లను పోటీదారులుగా నిలబెట్టడం ఈ చిత్రంలోని ప్రత్యేకత. అయితే, నిజాయితీ పరుడైన వాసు, పోటీ నుంచి విరమించుకోవడంతో, రివ్వున ఎగురుతున్న గాలిపటానికి తోక తెగి నట్లవుతుంది. 'నడిచే దారుల గమ్యా మొక్కటే, నడిపే వానికి అంద రొక్కటే' - అని మాటవరసకి అన్నారేగాని, ఆ సూక్తి సారం నిరూపణ కాలేదు.... ఆర్థిక మాంద్యం తర్వాత, పిల్లల చదువుకోసం గ్రామ సీమ నుంచి పట్నవాసం తరలి వచ్చిన ఒక కుటుంబ గాథ అంటూ ఎత్తుకొనేసరికి, ఒక వాస్తవ కళా రూపం చూడబోతున్నా మనిపిస్తుంది .... చిన్నతనంలో జయ 'నల్లని స్వామీ నారాయణా' అని పాడి నప్పుడు, సుందర రామయ్య హఠా న్మరణానంతరం, సూర్యం చదువు కోసం పాలిచ్చే పశువుని అమ్మిన మీదట, వాసు బఫూన్ వేషం ధరిస్తేనూ, యింకా ముందు ముందు ఏదో నవ్యత కనపడుతుందని ఆశి స్తాము. కాని, మూడు పెళ్లి ముహూ ర్తాలతో, మూడు జంటల ప్రణయ సల్లాపాలతో, మధ్య మధ్య తిరుపతి వెంకటేశ్వరునిపై భక్తి శ్రద్ధలు చూపిన ఈ మూడు గంటల చిత్రం లో, హాస్య సన్నివేశాలు ముందుంచ వేసి, కొన్ని పాత్రలను బుట్ట బొమ్మ లుగా చేశాయి.. మీ అమ్మాయిని మా అబ్బాయికి చేసుకుంటామని యింటి కొచ్చి అడిగిన పెదమనిషి, ఏభై వేలు కట్నం తెమ్మనడమేమిటి, ఆ దాహం తీర్చేందుకు శంకర్రావు తన ఇల్లు తనఖా పెట్టడమేమిటి ? ఎన్నటికీ తీర్చలేని ఈ అప్పుని, తల్లీ కూతుళ్లు ఎలా హరించారు ? 'కనరాని దేవుడే కనిపించినాడ'ని జయ, ఆనంద భాష్పాలు రాల్చడం, యిటు వంటి తండ్రి చాటు అప్రయోజకుని కోసమా ? హొటళ్లకి, షికార్లకి తన వెంట రావాలి గాని కట్నం చేరం జరిపించేది తండ్రా ? అప్పల స్వామి వంటి మునిసిపల్ ఛైర్మన్ చాలా అరుదు. అన్నదమ్ముల బాహుబల ప్రదర్శనతో, చివరికి నీతిబోధలా ముగు స్తుంది.... అంజలీదేవి, చంద్రమోహన్ తమ పాత్రలలో లీనం కాగా, రమణా రెడ్డి, రామ్మోహన్, సుకన్య, వాణిశ్రీ, పుష్పవల్లి పాత్రోచితన్యాయం చేశారు. కమనీయ గానమూ, కనువిందగు దృశ్యమాలిక గల ఈ చిత్రానికి దర్శకులు బియన్ రెడ్డి.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - ఫిబ్రవరి 1967




## స్పేస్ స్టేషన్

అమెరికా నిర్మించదలచిన అంతరిక్ష కేంద్రం (స్పేస్ స్టేషన్) 'ఫ్రీడమ్' నమూనాలో కొన్ని మార్పులు జరిగాయి. తొలుత అనుకున్న దానికంటె కాస్త చిన్నదిగా వుండే రోదసీ కేంద్రాన్ని నిర్మించాలని 'నాసా' భావిస్తున్నది. నిర్మాణానికి సంబంధించిన సంక్లిష్ట స్థితిని వ్యయ భారాన్ని తగ్గించడానికి ఈ నిర్ణయం. 'స్పేస్ స్టేషన్ ఫ్రీడమ్‌ని' మొత్తం 3,700 కోట్ల డాలర్ల వ్యయంతో నిర్మించాలని తొలుత భావించారు. అయితే నూతన నమూనా ప్రకారం ఇందులో 600 కోట్ల డాలర్ల ఖర్చు తగ్గుతుంది. క్రొత్త నమూనా ప్రకారం ఇందులో నిర్వహించే ప్రయోగాలన్నీ కేంద్రం మధ్య భాగంలోని 'ప్రెషరైజ్డ్ మాడ్యూల్'లోనే జరగవలసి వుంటుంది. ఇక్కడ జీవశాస్త్ర సంబంధిత విషయాలపై, దీర్ఘకాల అంతరిక్షవాసం వ్యోమగాముల పైన చూపే ప్రభావం మీద, అంతరిక్షంలోని భార రహిత స్థితిలో స్వచ్ఛమైన లోహాల ఉత్పత్తికి గల 'వాణిజ్య అవకాశాలను' గురించి ప్రయోగాలు జరుగుతాయి. కాగా, పరిమాణాన్ని తగ్గిస్తున్న కారణంగా ఈ 'స్పేస్‌స్టేషన్'ని భవిష్యత్తులో చంద్రుని పైకి, అంగారకుని పైకి నిర్వహించే యాత్రలలో ఒక మజిలీగా వాడుకోవాలనే ఉద్దేశానికి స్వస్తి చెప్పినట్టయింది. 'ఫ్రీడమ్' కక్ష్యలో పరిభ్రమిస్తుండగా అందులో ఎనిమిది మంది వ్యోమగాములు నివసించడానికి పని చేయడానికి వసతి వుండాలని మొదట్లో అనుకున్నారు. అయితే నూతన నమూనా ప్రకారం నలుగురు వ్యోమగాములకు మాత్రమే చోటు కల్పిస్తారు. ఎనిమిది విద్యుదుత్పాదక సౌరశక్తి పరికరాలకు బదులుగా ఆరు పరికరాలు మాత్రమే వుంటాయి-విద్యుదుత్పాక శక్తి 75,000 వాట్ల నుంచి 56,000 వాట్లకు తగ్గుతుంది. 300 టన్నుల బరువైన అమెరికా అంతరిక్ష కేంద్రం 'ఫ్రీడమ్' నిర్మాణం 1995లో ప్రారంభమవుతుంది - 2000 సంవత్సరం నాటికి అందులో వ్యోమగాములు శాశ్వత నివాసం ఏర్పరచుకుంటారు. (అమెరికా సమాచార శాఖ.

## ఇనుము

స్పాంజ్ ఇనుము ఉత్పత్తి పెంచడానికి కృషి జరుగుతోంది. ఈ ఇనుము ఉత్పత్తి చేసే కర్మాగారాల సంఖ్య 3 నుండి 5కు పెరిగింది. వీటిలో సాలీనా మూడున్నర లక్షల టన్నులకు పైగా స్పాంజ్ ఇనుము ఉత్పత్తి జరుగుతుందని భావిస్తున్నారు. వాయువు ఆధారంగా పనిచేసే స్పాంజి ఇనుము కర్మాగార నిర్మాణం చురుగ్గా సాగుతోంది. ద్వితీయ రంగంలో దుక్క ఇనుము తయారీ యూనిట్ల స్థాపనకు కూడా ప్రభుత్వం ప్రోత్సాహం ఇస్తోంది. దీనివల్ల ఉక్కు కర్మాగారాలపై దుక్క ఇనుముకు గల ఒత్తిడి తగ్గుతుంది. భారతదేశంలో ముడి ఇనుము వనరులు సమృద్ధిగా వున్నాయి. దేశంలో మొత్తం 17.6 బిలియన్ టన్నుల ముడి ఇనుము నిధులు ఉన్నాయనీ, వీటినుండి 12 బిలియన్ టన్నులను వెలికి తీయవచ్చుననీ ఇటీవల జరిపిన పరిశోధనలలో వెల్లడైంది. 1989వ సంవత్సరంలో సుమారు 5 కోట్ల టన్నుల ముడి ఇనుము లభించింది. ముడి ఇనుము ఉత్పత్తిలో గోవా అగ్రస్థానంలో ఉండగా, మధ్యప్రదేశ్ కోటి 30 లక్షల టన్నులతోను, కర్నాటక కోటి టన్నులు, బీహార్ 86 లక్షలు, ఒరిస్సా 75 లక్షల టన్నులతో తరువాతి స్థానాలు ఆక్రమించాయి. గోవా కర్నాటక రాష్ట్రాలలో ఉత్పత్తి, అయిన ముడి ఇనుమును కేవలం ఎగుమతులకే ప్రత్యేకించగా, ఇతర ప్రాంతాల్లోని ఖనిజం దేశంలోని ఉక్కు కర్మాగారాలకు వినియోగ పడుతుంది. ఇరాన్, జపాన్ దేశాలు ముఖ్యంగా ఈ ముడి ఇనుమును దిగుమతి చేసుకుంటున్నాయి. మార్మగోవా, మద్రాసు, విశాఖపట్నం ఓడరేవుల నుంచి దీనిని ఎగుమతి చెయ్యటం జరుగుతుంది. కుద్రెముఖ్ లో నూటికి నూరు శాతం ఎగుమతి విభాగం కుద్రెముఖ్ ఐరన్ ఓర్ కంపెనీని 1976 ఏప్రిల్‌లో నెలకొల్పారు. ఆధునిక కాలంలో దేశ సౌభాగ్యాన్ని బంగారంతో కాక, ఉక్కు ఉత్పత్తి ఆధారంగా అంచనా వెయ్యటం జరుగుతోంది. పరిశ్రమలన్నిటికీ కావలసిన ఉక్కు ఉత్పత్తి సమృద్ధిగా జరిగినట్లయితే, సర్వతోముఖ పారిశ్రామికాభివృద్ధికి మార్గం సుగమమవుతుంది. దేశంలో ముడి ఇనుము నిల్వలకు కొదువలేదు. వీటిని వినియోగించుకుని ఉక్కు ఉత్పత్తిని అధికం చెయ్యటానికి ఎటువంటి లోపం లేకుండా కృషి జరగాలి.

(బలదేవ్ సహాయ్ - పిఐబి

## పాల ఉత్పత్తి

ఆవులలో పాల ఉత్పత్తిని పెంపొందించేందుకు రూపొందించిన ఒక 'సింథటిక్ హార్మోన్' పాలను వినియోగించే వారికి గాని, ఆవులకు గాని ఎట్టి హాని కలిగించదని పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. 'బొవీన్ సోమటోట్రోపిన్' అనే ఈ సింథటిక్

హార్మోను ఈ దశాబ్దంలో పాడి పరిశ్రమ ఉత్పాదనలను గణనీయంగా పెంచగల 'బయోటెక్నాలజీ' ప్రక్రియ లలో అగ్రగామి. 'బొవీన్ సోమ టోట్రోపిన్' పై అమెరికా ఆహార, ఔషధ సంస్థ ఇంకా పరిశీలన జరుపు తూనే వున్నది. జన్యుశాస్త్ర ప్రక్రియల ద్వారా ఈ 'ప్రొటిన్', పాలిచ్చే గోవు లలో పాల ఉత్పాదనను పెంచుతుంది. సాధారణంగా ఆవుల శరీరంలోని పిట్యూటరీ గ్రంథులలో ఈ 'ఎదుగు దల హార్మోను' సహజ సిద్ధంగానే తయారవుతుంది. అయితే ఆవులకు ఈ 'గ్రోత్ హార్మోన్'ని ఇచ్చినప్పుడు ఆవు శరీరంలో ఈ హార్మోనులు అధికమై హెచ్చుస్థాయిలో పాల దిగుబడికి దోహదం చేస్తుంది. ఈ కృత్రిమ హార్మోనును ఆవు శరీరంలోకి ఎక్కించిన అనంతరం మొదటి కొద్ది వారాలలో ఆ ఆవు పాలలోని క్రొవ్వు పదార్థం శాతంలో కొద్ది పాటు మార్పులు వుండవచ్చునని, ఈ మార్పులు కూడా తాత్కాలికమని తెలిపారు. ఆవుల ఆరోగ్యం మీద ఈ కృత్రిమ హార్మోన్ ఎట్టి దుష్ప్ర వాన్నీ చూపదని స్పష్టం చేశారు. బొవీన్ సోమటోట్రోపిన్ అందుబాటు లోకి రాగానే దానిని 'డైరీ' ఫారం లలో వినియోగించడం ఆర్థికంగా ఎంతో లాభసాటి కాగలదు.....

(అమెరికా సమాచార శాఖ

సంక్షిప్త భాగాలు

# 'నా రాష్ట్ర చక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్య క్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమైన 'వ్యక్తి సత్యాగ్రహానికి' ప్రప్రథములుగా ఆయన వినోబా భావెని ఎన్నుకున్నారు ; జవహర్‌లాల్ నెహ్రూ రెండవవారు. 'జాతి పిత'గా దేశం గాంధీజీని గౌరవించి, సర్వోదయ సిద్ధాంతానికి కాస్త ఊపిరి నిచ్చిందే గాని, గాంధేయ పథం విస్మృతి పథాన పడింది.... రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారొకరు.... వారి జీవిత గాధలోని సంక్షిప్త భాగాలివి.

స్టీఫెన్, స్కాట్లాండు దేశపు మనిషి. అతని కలకత్తా మకాం 'గ్రాండ్ హోటల్'లో. తన నెల జీతంలో, తన ముఖ్యావసర మున్నంత వరకే తీసుకొని, నెల ఖర్చు క్రింద దానిని గ్రాండ్ హోటలు కిచ్చివేసి, మిగత డబ్బు యూనివర్సిటీకి జమ కట్టే వాడని మేము విన్నమాట. స్టీఫెన్ మహా శయుని జీవితౌన్నత్యాన్ని బట్టి దాని విలువ అమోఘం. ఒక రోజున మామూలుగా క్లాసుకు వచ్చి, బోర్డు మీద పాఠం వ్రాయడం మొదలు పెట్టాడు. నేనూ మరికొందరు విద్యార్థులూ అధ్యాపకుని యెదుట ముందరి బెంచి మీదనే కూర్చునే వాళ్లం ....ఉన్నట్టుండి నాకు.... పరీక్షల మధ్యలో చెవిపోటు ప్రారంభమై పరీక్షకు అంతరాయం కలుగునేమో యన్న జంకుతో దగ్గరనున్న ఒక బోసో, ఘోషో పేరుగల పెద్దడాక్టరు ఆస్పత్రికి వెళ్లి మందు వేయమన్నాను.

నాపూరు, పేరూ, చదువూ అడిగి దయతో బల్లపై పరుండబెట్టి నేను బెంగాలీవాడను కానని తెలుసుకున్నాడు. చెవి పరిక్ష చేయబోతూ "Do you know that a Special Congress Session is going on here at Calcutta? అన్నాడు. "I don't know, sir" అంటిని. పైగా చెవి పోటు బాధ, ఒక ప్రక్క పరీక్షలు – బాధ నివారణ కోసం ఆదుర్దా - అటావుంది ఆరోజున నా జవాబుతో ఊరకుండక. 'I say, have you ever heard of Gandhi ?' అన్నాడాయన. "Yes yes, I heard our College Principal speaking about him of a public meeting at Kakinada, in 'connection with the Indian Settlers' non-violent fight (resistance) against the South African Government under his guidance," అన్నాను నేను.

'You know what he now wants to do?'

"He wants to Non-Co-operate with the British Lion."

నా చెవిలో మందు వేసి మరి కొంచెం మందిచ్చి నన్ను పంపివేశాడు. అట్లా గాంధిపేరుతో మాత్రమే నాకు పరిచయం చేశాడాయన - నా చెవి పోటు మూలాన. డాక్టరు దృష్టిలో గాంధీ అనేవ్యక్తి బ్రిటిష్ సింహంతో కొనడం ఒక ఉన్మాద. చర్య. ఒక్క చేతి మీదుగా ఎత్తి పట్టుకున్న ఆ గోవర్ధనగిరి రక్షాశక్తిధారుని చూచాయగా నైనా, అశిక్షితమై యున్న నా మనసు తగులకుండానే ఏదో చదువు కొని ఏదో ఉద్యోగాన్వేషణ కోసం పోయే సర్వసామాన్య దృష్టితో కలకత్తా విడిచి పోయినాను.

ఇంతా చెప్పి ఒక్కమాట చెప్పడం మరచాను. మా పెండ్లి సమయం (1914)లో నా భార్యకు తల్లి తండ్రులు పెట్టిన బంగారు వస్తువు లుండేవి. మా కలకత్తా నివాసం నాటికి ఆమె చిన్న పిల్లయినా, అవన్నీ ఇబ్బికంగా అమ్మకానికి యిచ్చి నా చదువు ఖర్చుకూ, యింటి ఖర్చుకూ, ఆ డబ్బును వినియోగ పరిచింది. ఆమె నగలను కలకత్తాలో బజారులోన అమ్మిపెట్టడంలో పూర్వసహాధ్యాయి పెండ్యాల సత్యనారాయణరావు I. C. S ఆ సమయంలో కలకత్తాలో నాతో నుండి సహకరించాడు. సహాధ్యాయులుగా మా మధ్య నుండిన గాఢమైత్రిని గూర్చి 1910 - 14 వీరేశలింగంగారి హితకారిణీ హైస్కూలు చదువు సందర్భంలో పైన చెప్పకునే వున్నాను.

మరొక్కమాటతో నా చదువులకథ ముగిస్తాను. నా గృహిణి వెంకాయమ్మకు ఇంగ్లీషు రాదు. బెంగాలీ కుటుంబంతో అనుక్షణ కలిసియుండినందువల్ల బెంగాలీ మాటలాడటంలో మంచి ప్రావీణ్యం సంపాదించింది. కొంచెం వ్రాతకూడ నేర్చిందేమో! దాని యవసరం లేనందువల్ల నాకు పట్టుపడలేదు.

## రెండవ భాగం

(అనుభవాలు, అభిప్రాయాలు, ఆశయాలు)

### 1

కలకత్తా నుండి రైలుదిగి, నేను నా భార్య ఒక రాత్రి వేళ రావులపర్రు స్వగృహానికి చేరుకున్నాము. ఫలానా రోజు ఫలానా టైము అని చెప్పి ముందుగా ఉత్తరం వ్రాసే వచ్చాము. మా అమ్మ యేడుస్తూ పండుకొని యుంది. అంతకు ముందురోజుల్లో నేను యజ్ఞోపవీతం త్యజించినట్టు ఆ యుత్తరంలోనే చెప్పియుంచాను. ఆ సంగతి తెలపియుండటమే మా అమ్మ దుఃఖానికి కారణం. జందెం తీసివేయ డమంటే సంఘ బహిష్కారం. అందుకు నేను సిద్ధపడే యుంటిని. అన్నం వాకిట్లో పెట్టినా తింటానని, కుటుంబానికి దూరం కానని, నన్ను పరాయి వాడుగా మాత్రం చూడ వద్దని ఆ జాబులో వ్రాశాను. మా అమ్మ రోదిస్తూనే వుంది. మే మింటికి చేరేసరికి మా చిన్న మేనమామ (మమ్ము ప్రేమదో పెంచిన పెద్ద మేనమామ 1985లో చనిపోయి నాడు) గదిలో పండుకొని యుండి 'ఎందుకమ్మా యేడ్పు - వాడు మన వాడుకాడు' అని ఒక్క మాటతో నమ్ము శపించి ఊరకొన్నాడు. నేను జందెం వర్జించడంలో అన్యాయిత్వ మేమీ లేదనీ, ఎవరి యిష్టం వారిదనీ చెప్పింది నా చిన్న చెల్లెలు (పెద్ద చెల్లెలు 1910లోనే పోయింది) వెంకమ్మ. చదువురాకపోయినా మా అమ్మ అజ్ఞాని కాదు. కనుక మా చెల్లెలిచ్చిన ఓదార్పు బాగా పనిచేసింది.

జందెం ధారణ, విసర్జన గూర్చి మరి కొంచెం చెప్పుకోవాలి. దానిని 'యజ్ఞోపవీత' మన్నారు. 'జ్ఞానయజ్ఞ' మని దానికి 'గీత'లో మహోత్కృష్టమైన అర్థముంది. 'సహాయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా' అనీ, 'అనేన ప్రసవిష్యధ్వం' అని కూడ వుంది. అట్టి జ్ఞాన యజ్ఞ భావానికి గుర్తు యజ్ఞోపవీతం. రవీంద్రుని 'విశ్వభారతి' అధ్యాపకుడు విధుశేఖర భట్టాచార్య 'The Sacred Thread' అనే మకుటంతో వ్రాసిన వ్యాసం యొక్క అంగ్లాను వాదం Modern Review లో దశాబ్దాలకు పూర్వం నేను చదివాను. తక్కువతో పోల్చుకొని చలిస్తే జాతీయ పతాకం వంటి గుర్తు అది కావచ్చు. ఆర్య సమాజ ప్రధానాచార్యుడు స్వామి శ్రద్ధానంద ఒకనాడు గాంధిని ప్రశ్నించాడట: నీ జందెం ఎందుకు తీసివేశావని.

'కులభేద నిర్మూలన సూచకంగా యజ్ఞోపవీత ధారణ, నిత్యాగ్ని హోత్ర వేద మంత్ర పఠనంతో గూడిన ధర్మ విధి. నా శరీరాన్ని చుట్టవేసి పెట్టుకున్న ఒక విషసర్పంవలె కనబడుటం చేత దానిని నేను వర్జించాను' అని శ్రద్ధానందునికి గాంధి యిచ్చిన జవాబు. అంటే కుల భేషజాలను, ద్వేషాలను సంఘంలో నిలిపి వుంచిన విషసర్పమని గాంధి అభిప్రాయం. జందెమున్నవాడు, అదిలేనివాణ్ణి చిన్న

చూపు చూచే కార్పణ్యం రాను రాను సంఘ శరీరంలో వ్యాపించివుంది. ఈ నాడు 95 శాతం బ్రాహ్మణ నామ ధారుల్లో ఆ వస్తువొక తెలియని అహంకృతికి తోడ్పడుతోంది. అంట రానితనం, చూడరానితనం, చెప్ప రానితనం అట్టి అజ్ఞానాహంకార విష వృక్ష బీజాలు. పూర్వం మా యింట్లో ముసలమ్మ 'మాలవాడ'ని కూడ అనలేక, చెప్పరాని వాడనేది ! అందు లకనియే Caste must go ! అని ఖండించి చెప్పాడు గాంధి. కాని ఆది కాలపు "వర్ణ ధర్మం.... గుణకర్మ విభాగశః" – అది మరల వస్తేగిస్తే భారతదేశానికేగాక మొత్తం ప్రపంచా నికే శాశ్వతాదర్శ మన్నాడాయన. కాని స్వార్థ పరతవల్ల మానవుని ప్రకృతి మారి, మారి, ఇకమీదట అట్టి రక్షామంత్రం ఆచరణకు మరె క్కడా రాదని చెప్పి చెప్పి, వ్రాసి వ్రాసి. యిక చెప్పడం మానుకున్నాడు గాంధి ! మహాబుద్ధిశాలి John Ruskin చెప్పిన "Upto this last" ధర్మానికి ఒక విధంగా సరి వచ్చే ఆర్థిక సిద్ధాంత మిది. వర్ణ ధర్మం లాగునే 'ఆశ్రమధర్మా' విష్కరణకు

ఇండియాయే పుట్టినిల్లు. ''The Fourfold Way of India'' అని చెప్పి మన రవీంద్రుడు ఉపమానాలతో, ఉదాహరణలతో ఒక మనోహరమైన వివరణ వ్రాశాడు Modern Reviewలో దశాబ్దాలకు పూర్వం. ఆ చిత్రణ నా మనసుకు పట్టియుంది. ఇప్పటికీ 'దేవుడు లేడు' అని నోటపలికే వాడు మాత్రమే కాడు నాస్తికుడు. ధర్మంపేర వట్టి గొడ్డార్పులరచే ఆస్తిక నామువందరు మొదట రకం నాస్తికులు.

ఇంటి నుండి ఒకసారి నా రెండో స్వస్థానం రాజమండ్రికి వెళ్ళిరావాలి కదా! ఏదోకాస్త చదువు మిష మీద నా కచ్చివచ్చిన యూరు అది. వీరేశలింగం హైస్కూలు కార్యదర్శి సుందరశివరావుగారు కనిపించి 'రండయ్యా, మన స్కూలు మీ కోసం ఎరురుచూస్తోం' దంటూ నా కోసం అధ్యాపకస్థానం ఒకటి చూపించాడు — 1921 జనవరి నుండి ఏప్రిల్ వరకూ జరిగిన short term అది. స్కూల్లో చేరానే కాని మనస్సు దాని మీద నిలువలేదు. మద్దూరి అన్నపూర్ణయ్యగారు మొదలిడిన 'కాంగ్రాసు' వ్రాత పత్రికను సైక్లొస్టయిల్ తీయడం, తోచినట్లు అందులోనే ఏదేదో వ్రాయడం; బహిరంగ సభలకు హాజరుకావడం — యిట్లా గడిచాయి ఆ short term స్కూలు నెలలు. యూనివర్సిటీ చదువు తరువాత బడిపంతులుగా (అదీ వీరేశలింగం స్కూలులోనే, మరెక్కడనో కాదు) జీవితం గడపవలెనని నా నిశ్చయం. బుద్ధికలిగి చేస్తే అదే ఉత్తమవృత్తి. ఈ రెండేళ్ళ M. A.కు తోడు మరొక్క సంవత్సరం కష్టపడితే, రెండు డిగ్రీలు సంపాదించి 'లాయరు'వు కూడ కావచ్చును కదా యని కలకత్తా సహాధ్యాయులు నన్ను హెచ్చరించేవారు. లాయరు పని నాకు భర్జించదని సమాధానం చెప్పేవాణ్ణి. కలకత్తా రోజులలో నేనెందుకో ఒకరింటికి వెళ్ళవలసి వచ్చింది. ఆయనది లాయరు వృత్తి, ఆయన ఆఫీసు బల్లపైన ఒక గాజు Paper Weight నా కండ్లబడ్డది. దాని లోపల 'Time is Money' అనే వ్యాకం చెక్కబడి యుంది. అంటే ప్లీడరు వృత్తిలో డబ్బు సంపాదనకే ఎక్కువ ప్రాధాన్యమని నా కర్థమయింది. అట్లాగునా, అంతేనా! - అనుకున్నాను. రాజమండ్రిలో నేను బాగా ఎగిరిన ఒక ప్లీడరు మిత్రుడుండెను. ఒక సకాలత్ పట్టి ఫీజు వాలవరకు ముందే వసూలు చేసుకున్నాడు. ఆ దావాలో తన పార్టీకి వ్యతిరేకంగా తీర్పు చెప్పబడ్డది. 'అయ్యా, నా దావా ఓడిపోయిందికదా నిన్న తమరు పుచ్చుకున్న నూరు రూపాయలైనా నా కిచ్చివేయుడ'ని ప్రాధేయపడ్డాడు క్లయంటు. 'చచ్చిపోయినవాడు (అంటే చెల్లించివేసిన డబ్బు) తిరిగి వస్తాడా?' అని ప్లీడరు వేసిన తిరుగు ప్రశ్నతో మరి చేసేది లేక క్లయింటు వెళ్ళిపోయినాడు.

1920 సెప్టెంబరులో ఒకనాడు నా చెవి నొప్పికి మందువేస్తూ గాంధీ అసహాయోద్యమాన్ని గూర్చి కలకత్తా

డాక్టరు చేసిన remark ఏ విధంగానూ నా మీద పనిచేయలేదు రాజకీయాలలో నేను అడుగు పెట్టియుండక పోవడమే అందుకు కారణం.

"Breathes there the man with soul so dead, who never to himself hath said 'this is my own, my native land ?' అన్నాడు Sri Walter Scott. 'నేను స్వతః మతధర్మవాదిని ; ప్రాణావసరం కొద్దీ రాజకీయాల్లో ప్రవేశించా' నంటాడు గాంధి, ఈ చిట్టెలుక తోక, ఉడుత తోక ప్రకాశరాయుని జీవితం కూడ అట్టిదే. ఈ యెత్తుగడ, భారత జాతిని అన్ని విధాలా ఉద్ధరించడానికి గాంధి లేవదీసిన ఆత్మోద్ధారకోద్యమమని నావంటి వాళ్లకు ధ్రువమయింది. 'ఇండియా రాజకీయ స్వేచ్ఛకై నేనెంత కాలమైనా వేచియుండగలను ; కాని అస్పృస్యతా నివారణ పట్ల ఒక్క రోజు కాలహరణాన్ని కూడ నేను సహించలేను' అన్నాడు మహాత్ముడు. 'సంభవామి యుగేయుగే !' అన్న భగవంతుని వాగ్దత్తానికి సరి వచ్చే ధర్మ విప్లవం గాంధీది. అట్లా తాత్కాలికంగా వచ్చి పడ్డ నా స్కూలు ఉపాధ్యాయత్వం మూలబడ్డది. గాంధీ యుద్యమం కూడ పూట పూటకూ, గంట గంటకూ ఆసేతుహిమాచలం ఉఱ్ఱూత లూగింది. ఇక అటూ, యిటూ అనే తటపటాయింపుకు లేశ మాత్రం నాలో చోటు లేకపోయింది. నావంటి వేలాది మానవులను సముద్ర కెరటం లాగున తనలోకి లాగివేసుకుంది - నా లెక్కేముంది ? బుద్ధదేవుని బోధామృతస్పర్శ, ఆ వీధి దాటకుండానే

అతని తమ్ముడు నందుణ్ణి ఎలా లాగి వేసిందో! అన్నతో కలిసి నాలు గడుగులు నడిచే సరికి ఆ దివ్యస్పర్శ తమ్మునికి ఐచ్ఛిక దారిద్ర్యం, నిజమైన సన్న్యాసభాగ్యం యిప్పించింది. నేను నందుణ్ణి కావడానికి ఎన్ని జన్మలెత్తాలో కాని, ఆనాటి గాంధీ భవతార కోద్యమ బుద్ధ వాణి ఈ యాధునిక యుగంలో అపూర్వం, కనివిని యెఱుగనిది. కొందరు అవిశ్వాసులకు దాని వాలు, మూలం అందకపోయినా, బహుకొద్ది రోజులలో అది దేశానికొక మహావరమయింది. అతి తెలివి గల intellectuals, సంశయాత్ములు, స్వార్థపరులు ఉద్యమానికి దూరమైనారు. అమాయకులు, అక్షరాలు రానివాళ్లు, ఊడుగువిత్తులు మాతృవృక్షానికి అంటుకొనిపోయినట్లు దానినే నమ్ముకొని దానితో ఏకమైనారు. ఒక్క భగీరథుని ప్రయత్నం వల్ల ప్రపంచానికి దప్పి తీరినట్లు, ఒకే ఒక్క గాంధి త్యాగంవల్ల సత్యాగ్రహసారస్యం ఐదు ఖండాలకూ విదిత మయింది.... నా స్కూలు మాష్టరీ ఉద్యోగంతో పాటు రెండు నెలలలో వేసంగి సెలవులు కూడ అయిపోయినాయి. బడి re-opening రోజు వచ్చింది. దేశానికి గాంధి యిచ్చిన పిలుపు అందరితో పాటు నాకును అనుల్లంఘనీయమై ఆ రోజునే నన్ను స్కూలు హెడ్‌మాష్టరు వద్దకు పంపింది. 'బాబూ, ఇక్కడి నా యుద్యోగం యింతటితో సరి — సెలవియ్యండి!' అన్నాను. 'ఏమిటోయి — ఏమిటీ సెలవు? ఈ స్కూలు మనది. ఇందులో పనిచెయ్యడానికే మనం రాజమండ్రిలో ఉన్నాం' అన్నాడాయన. 'నేను చేరబోతూన్న గాంధీ యుద్యమ పాఠశాల ముందు ఈ స్కూలు ఒక లెక్కకు రాదు. అందులో చేరి నేను ఏంచేయగలనో లేదో కాని, అదొక విశాల జీవన దీక్షా గృహం. యావత్తు దేశం దృష్టి దాని మీదనే వుంది. నేను వెనకబడరాదు. సెలవిచ్చి పంపండి' అన్నాను. వెనుక 1910లో వీరేశలింగం హితకారిణీ హైస్కూలు S.S.L.C లో ఇంగ్లీషు అధ్యాపకుడుగా ఆయన శ్రీ జయంతి గంగన్నగారు, మాకు బోధించిన Tennyson's Poem, 'Charge of the Light Brigade', లోని 'There is not to make reply; There is not to reson why; here is but to do and die' అనే lines జ్ఞాపకం చేసుకొని, ఆయనకే అప్పజెప్పాను. 'ప్రశ్నలకు, ప్రత్యుత్తరాలకు చోటులేని శాంతి సమరంలో పాల్గొనబోతున్నాను. ఇక సమయం లేదు. ఆశీర్వదించి పంపండన్నాను. నా అభీష్టం, ఆశయం మా గంగన్న మాష్టరు గారికి బాగా అర్థమయింది. నిండా ఆశీర్వదించి పంపివేశాడు.

## 2

ఆ రోజు నా కొక పర్వదినం. స్కూలు నుండియే నేరుగా ధవళేశ్వరం నడిచివెళ్లాను ఆ నడక ఆ పిదప నన్ను తరచు పాదచారిని చేసిన

నడక. అదృష్టం అందుకుంది. నేను చేసిన ధవళేశ్వర ప్రయాణం ఎందుకు ? అది యాదాలాపంగా తటస్థించినది, కాదు. అనివార్యంగా తోసుకొని వచ్చిన సంఘటన. నన్నా వహించిన 'రాట్నచక్ర' దప్పి, నన్ను నడుపుకొని పోయింది. అప్పటికే, అంతే ఉద్యమ విజృంభణతో పాటే దేశం మీద రాట్నాలు ఎక్కడికక్కడ తయారవు తున్నాయి. ధవళేశ్వరం కార్ఖానాకు వెళ్లి 8 ఆకుల రాట్నం తీసుకున్నాను. నేనిచ్చిన ఖరీదు రు 5/-లు మాత్రం. ఒక్కటో రెండో కదుళ్లు, కొన్ని యేకులు, నూలుచుట్టే పంటికల్లు, ఒంటెద్దు బండి మీద వేసు కొని యింటికి చేరాను. చేతనయి, కాకుండాను చక్రాన్ని తిప్పడమే తిప్ప డం ! సత్యాగ్రహోద్యమవు రెండం గాలూ, (సహాయ నిరాకరణం, శాసనో ల్లంఘనం) రాట్నంతో ప్రారంభమై రాట్నంతోనే సాఫల్యం పొందాయి. గాంధి తలచిన భారతాభ్యుదయానికి రాట్నమే పునాది ; రాట్నమే ఉద్యా పన. గాంధి యిచ్చిన నూతన శాంతి సందేశం ఆ రెంటికీ ముఖ్య ప్రాణం. ఆ పనులు రెండూ చేసిచూడగలిగిన దేశస్థులకు అదొక తిరుమంత్ర భిక్ష. సూత్రయజ్ఞం చూస్తే సులభ సూక్ష్మమైన వడ్ల గింజలో బియ్యపు గింజ పని ; ఫలితం మట్టుకు శత సహస్ర ముఖాల సమగ్రముగు భారత జాత్యభ్యుదయం ! ఇది ప్రతి భారతీ యుని విధ్యుక్తం. ఈ యజ్ఞదీక్షతో మతభేదాలన్నీ మడసిపోవాలి. 'సుజలాం, సుఫలాం సస్యశ్యా మలాం, వందేమాతరమ్'గా భారత మంతా ఒక తల్లి గన్న సంతానం కావాలి. అందరు కలిసి ఏక కంఠంతో 'జన గణ మన అధి నాయకునికి' జయం పలకాలి. అట్లవు తుందని చెప్పి ఆ (చక్ర) దీక్షయే రుజువు పరుస్తుంది. శిష్ట రక్షణ చేసే

(దుష్టశిక్షణ కూడాను) విష్ణు చక్రం ప్రతీకయే, కొయ్యగా కానవచ్చే ఈ చక్రం. అది ఆత్మయైతే, ఇది దాని శరీరం. ఇక్కడి వృత్తుల్లో యిదొక వృత్తికాదు. అసలు డబ్బులు తెచ్చే లేక పోగుపెట్టుకునే పరిశ్రమలు భారత సంస్కృతిలో లేనేలేవు. పరిశ్రమలన్నీ ధర్మాలే యిక్కడ. రాట్నం, సేద్యం విడివడని భారత జాతి ప్రధాన ధర్మాలు. 'స్వావలంబన' యే యిక్కడి వేదం, శాస్త్రం - రెండూను. దాని రెండు నేత్రాలు, రెండు హస్తాలు, రెండు పాదాలు, అన్నం, పానం, ఉచ్ఛ్వాసం నిశ్శ్వాసం భారతావని బలం భాగ్యం!

రాట్న చక్ర బాహ్యరూపాన్ని కంటజూడక పూర్వమే, ఏదో కార్యార్థం గాంధి దక్షిణాఫ్రికా నుండి ఒక **deputation** మీద ఇంగ్లాండుకు వెళ్లి తిరిగి వస్తుండగా ఇండియా విముక్తికి రాట్నమే ఏకైక సాధనమనే పరమ సత్యం ఆయన మనోవీధిని ద్యోతకమయిందట. అంతకు మునుపు నేతమగ్గమే రాట్నమనుకునే వాడట. స్వదేశానికి చేరిన వెంటనే గుజరాత్ మూలమూలల దానికోసం గాలించగా గంగాబెన్ అనే ఒక వృద్ధవనిత తన యింటి అటుకపై బడియున్న ఏనాటిదో ఒక కొయ్య చక్రాన్ని తీసుకొని వచ్చి గాంధి ముందుంచింది. ఇండియాకు పునర్జన్మనీయనున్న వస్తువిదే యనే ఆవిష్కరణ (discovery) అతనికి నేత్రపర్వంగా దర్శన మిచ్చింది. దానితో రాట్నం పునఃప్రతిష్ఠ, ఆధునిక చరిత్ర ప్రారంభమయినాయి. నిండు శోభతో ఆనాడు వికసించిన ఈ పుష్ప రాజం ఈ రోజున ఏమయింది - ఎట్లుంది? రేకలు రాలిపోయి తొడిమె మిగిలిందా; లేక సమూలం మాడిపోయిందా? ఇందుకు కారకులెవరు? ఇక అడుగకండి.

తరువాతి నా జీవితఘట్టం : నీవైతే స్కూలు పనికి రాజీనామా పెట్టావు సరే, కానీ తరువాత కార్యక్రమమేమిటని సోదరుడు డాక్టర్ గురుమూర్తిగారు అడిగారు. నాకు పనే ఉండదా, మీరేం చేస్తారో అదే నేనూ చేస్తానని తడుము కొనకుండ వెంటనే ఆయనకు నా జవాబు. 1907-08 'వందేమాతరో' ద్యమంలో వెలసి మూలబడిన జాతీయ పాఠశాలను revive చేస్తున్నామనీ, దానికి నన్ను ముఖ్యాధ్యాపకుడుగా పని చేయమనీ అన్నారు, సహాయ నిరాకరణోద్యమ మిత్రులు. ఆహా! నాకోసమే ఈ తీర్థ మెదురైందను కొన్నాను. ఆంగ్లప్రభుత్వ విద్యా పద్ధతికి ఎదురెత్తుగా సహాయ నిరాకరణ పంచవిధ బహిష్కరణలలో ఇదొకటి. జాతీయ విద్యాశాలల స్థాపన; విద్యార్థుల చేతనేగాక అధ్యాపకుల చేత గూడా ప్రభుత్వపాఠశాలల బహిష్కరణ; విదేశవస్త్ర, వస్తు బహిష్కరణ: బ్రిటీషు కోర్టుల బహిష్కరణ; దానితోపాటు ఉద్యమంలో చేరిన న్యాయవాదుల ద్వారా స్వదేశీ ప్రైవేటు న్యాయస్థానాల స్థాపన-ఇవన్నీ ఒక్కపెట్టున అందుకున్నాయి. ఈ

రాజమండ్రి జాతీయ పాఠశాల 1907-08 లలోనే, బందరులో నెలకొల్ప బడ్డ ఆంధ్ర జాతీయకళాశాల వంటిది. అదీ, ఇదీ కూడ అదిలో లాల్, బాల్, పాల్ ఉద్యమంలో నెలకొల్ప బడ్డవే. అది వరసగా వర్ధిల్లింది. ఇది అప్పుడు మూతబడి మరల గాంధీ జాతీయ పాఠశాలగా పునరుద్ధరింప బడ్డది. అదిలోనే దీనికోసం జాంపేట లో రాజమండ్రి వర్తకులు 14 ఎక రాల బత్తాయి తోట, అందులో రెండు పక్కా పెంకుటిళ్ళు కొన్నారు, తోట, ఇండ్లు 1921లో గూడా బాగున్నాయి. దానికి మరల ఒక నూతనత్వం సిద్ధిం చింది. నాతోను మరి ముగ్గురు నలు గురు ఉద్యమాభిమానులతోను (అభి మానులే కారు, దీక్ష వహించిన కార్య కర్తలు) ఒక ఉన్నత పాఠశాల ప్రారంభమయింది. అధ్యాపకులలో శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య, గరికి పాటి సూర్యప్రకాశరావు గార్లు ఉద్యమ దృష్ట్యా నాకు బాగా తోడ్పడినవారు. సూర్య ప్రకాశరావు గారు మొదటిరకం స్వచ్ఛంద సేవ కులు. ఆయన జీవితం, శీలం నాకొక అదర్శంగా పనిచేసింది. మహాత్ముని పిలుపు దేశ వ్యాప్తమగు శంఖారావం - అర్జునుని దేవదత్తం అయింది. తల్లి దండ్రుల మాట వినకుండ higher formల లోని విద్యార్థులు కూడ పాఠశాలలు వదలి బయటికి వచ్చేశారు. అందరు కలిసి రమారమి నూర్గు రుంటారు. వారి విద్యావసరాలు తీర్చ టానికి ఈ విద్యాలయం, చేసినన్నాళ్ళు పూర్తిగ పనిచేసింది. విద్యంటే పుస్తక పాఠాలు మాత్రమే కాదు. విద్యార్థుల లో నాతో కలసి నా ప్రక్కనే మెలగిన గూడా కృష్ణమూర్తి, బావలి అచ్యుత రామయ్య, ముంజులూరి జనార్ధనరావు, చిన్న కుఱ్ఱవాడు మద్దూరి సుందర రామమూర్తి, ఒట్టెద్దు పార్వతీశం, మరుద్దామన్నా మరపురారు. వీరందరూ దివంగతులైనారు. అయినా నా కనుపాపలలో మసలుతున్నారు. కొంచెం పెద్దవాళ్లయి, కొంతకాలం తమ పనులు తాము చేసుకొంటూ నన్ను విడిచిపోయినారు. విధి విలాసం. ఈ కథలు చెప్పుకొనడానకేనా నేను మిగిలియున్నాను ?

గాంధీ సహాయోద్యమం జాతి జీవితంలో వచ్చిన ఒక ఉవ్వెత్తు ఊపు. సంభవామి యుగే యుగే - కాల చక్రం ఎప్పుడు ఎక్కడా అంతే ! బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, మహా వీరుడు ఇపుడేరి ? వారి ధర్మ సంస్థా పన ధ్రువనక్షత్రంతో చెలిమి చేస్తోంది. అదే దాని స్థిర నివాసం. అయితే నేమి ? అన్నీ నశించినా తిరుగులేనిది దాని వెలుగు. పెద్ద బాలశిక్షలోని 'అమ్మమాట' దానిది. అన్నీ అంత రించినా కాలమున్నంత వరకు అమ్మ పలుకు శాశ్వతం. Truth (God) is eternal. (ఇంకా వుంది

✠

శ్రీ తల్లాప్రగడ రాజారామ్, గాం ధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ, 521 123) సౌజన్యంతో....పుస్తకం వెల : రు. 20-00.

3

?

"They say Vedavati was reborn as Seeta to punish Ravana for his misconduct. Dad, why did she sit all alone on a hilltop ?"

"Raghu, my boy, she was the daughter of a great sage, Kusha Dwaja and was born at a time when he was reciting the Vedas. Hence that name. Kusha Dwaja ardently desired to give his daughter in marriage to Lord Vishnu but Dambha, the Demon, was opposed to that idea. And this Dumbha killed Kusha Dwaja while the sage was in deep sleep. The *Rishi's* wife ended herself on her husband's funeral pyre."

"*Saha Gamana* - as the ancients glorified it. But that young girl Vedavati was left all alone," observed Raghu.

"She was not afraid of being alone but with a deep sense of commitment she was out to carry her father's wish - the wish of being tied to Lord Vishnu in sacrement. Vedavati went to the Himalayas to do her *Tapas*. One day Ravana appeared before her and she told him in right earnest her father's wish but the King of Rakshasas, in his arrogance and might, dared proposing to her and that brought in fumes of fury in her. Immediately she invoked *Yoga Agni* and flung herself into it, cursing Ravana for his misbehaviour. And consequently Janaki married Vishnu (Rama) and taught Ravana the lesson of his life," said Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha* (*Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*

3

## డైరీ

### డిసెంబరు 01, 1991

ఫిలిమ్ ఛాంబర్ ఆడిటోరియమ్‌లో 'సిటిఎ' (సినీ టెక్నిషియన్స్ అసోసియేషన్) వారి బహుమతి ప్రదానోత్సవం. ఈ సంవత్సరం రామనాధ్ అవార్డ్, సౌండ్ ఇంజనీరు పివి కోటిశ్వరరావుకు - 1940 లో బియన్ రెడ్డి, రామనాథ్, శేఖర్‌ల కాలంలో వాహినిలో అడుగుపెట్టిన కోటీశ్వరరావు సినీ ప్రపంచ సాంకేతిక రంగంలో ఎంతో అనుభవజ్ఞులు. సిటిఎ వారి అవార్డులలో ప్రథమస్థానం వహించిన రామనాథ్ అవార్డ్ ఆయనకు యివ్వడం ఎంతో సముచితం. అలాగే ఎవియమ్ అవార్డ్ సంగీత దర్శకులు దేవాకు, బొమ్మయ్ నాగిరెడ్డి అవార్డ్ ఫిలిమ్ ఎడిటర్ శ్రీకార్ ప్రసాద్‌కు, యల్వి ప్రసాద్ అవార్డ్ ఛాయాగ్రాహ దర్శకులు విన్సెంట్‌కి, యమ్ జి ఆర్ అవార్డ్ దర్శకులు సిబి మలయిల్‌కి, కరుణానిధి అవార్డ్ సినీ రచయిత పరిమళమ్‌కి, 'పేసమ్ పడమ్ అవార్డ్ రచయిత విక్రమన్‌కి, కొత్తగా ప్రారంభించిన కె సుబ్రహ్మణ్యమ్ అవార్డ్ నిర్మాత సుందరమ్‌కి సమర్పించారు. ఫిలిమ్ పరిశ్రమకు యితోధిక సేవ చేయడమే ధ్యేయంగా గల ఈ 'సిటిఎ', అనేక దేశాలు 'ది యియర్ ఆఫ్ షెల్టర్' జరుపుకుంటున్న సందర్భంగా, తనకీ ఒక గూడు ఏర్పడాలనీ, ఫిలిమ్ డైరక్టర్స్ కాలనీని ఉద్భవింపజేసిన రాజారామ్, ఈ విషయంలో దారి చూపగలరని అభిలషిస్తున్నామనీ - అన్నారు అసోసియేషన్ అధ్యక్షులు జనార్దనరావు - స్వాగతం తెలుపుతూ! కార్యదర్శి యస్ రాజగోపాల్ సభా కార్యక్రమం నిర్వహించారు. అధ్యక్షత వహించిన రాజారామ్ నవ్వులు చిందించే వెనకటి సంగతులు చెప్పారు .... లంచ్ అనంతరం 'యమ్‌జిఆర్' అవార్డ్ గ్రహీత సిబి మలయిల్ దర్శకత్వం వహించిన 'హిజ్ ఎక్సలెన్సీ అబ్దుల్లా' మళయాళ చిత్రం, ఆహూతుల కోసమని! అయితే, లంచ్‌కీ, చిత్ర ప్రదర్శనకు వుండే అవకాశం లేకపోయింది - ఆదివారమూ గెస్టులూ కారణంగా!

అదే ఫిలిమ్ ఛాంబర్ ఆడిటోరియమ్‌లో సాయంత్రం ఆరు గంటలకు విఆర్ నార్ల సంస్మరణ సెమినార్....

"పార్థసారథి నాయుడు 'ఆంధ్ర ప్రకాశిని'తో 1885 లో తెలుగు జర్నలిజమ్ ప్రారంభమయింది. 1905 లో గాడిచర్ల హరి సర్వోత్తమరావు 'స్వరాజ్య' అనే పత్రిక ప్రారంభించారు. 1907 లో బొంబయిలో వార పత్రికగా ప్రారంభమైన 'ఆంధ్ర పత్రిక' 1914 లో మద్రాసు వచ్చి, దిన పత్రికగా ఏ రోజుకారోజు వార్తలు చదవడం తెలుగువారికి నేర్పింది ; 1938 లో 'ఆంధ్రప్రభ', 1975 లో 'ఈనాడు' - ఈ విధంగా పత్రికా పఠన నిత్యకృత్యమయింది. తెలుగు జర్నలిజమ్‌లో 'నార్ల'కు గల స్థానాన్ని ఈ సమావేశంలో పాల్గొనే వక్తలు వివరిస్తారు" - అంటూ స్వాగతం తెలిపారు బియస్సార్ కృష్ణ ... "నేను లోక్‌సభలో ఉండగా, ఆయన రాజ్యసభలో ఉండేవారు. నార్లవంటి వ్యక్తులు చాలా అరుదు. ఆయన అభ్యుదయ భావాలు గల పత్రికా సంపాదకుడే కాదు, గొప్ప సాహితీకారుడు, సునిశిత మేధావి. ఆయన వ్యక్తిత్వంలోని విశిష్టత, స్నేహపాత్రత మరుపురానివి" - అన్నారు అధ్యక్షత వహించిన జగ్గయ్య. తెలుగు పత్రికా ప్రపంచంలో నార్లవారి స్థానం అద్వితీయమనీ, తాను యింగ్లీషు జర్నలిస్ట్‌గా దూరాన వుండటం వల్ల ఆయన సంపాదకీయాలతో అంతగా పరిచయం లేదనీ అన్నారు ఎయస్ రామన్ .... "నాటక రచయిత, నాటక సంఘంలో అంతర్భాగమై వుంటేగాని ప్రేక్షకులని మెప్పించే నాటకాలు సృష్టించలేడు. చూస్తున్న వారిలోని స్పందన ప్రత్యక్షానుభూతితో గాని అవగతం కాదు. చదువుకునేందుకు బావుండే నాటకాలన్నీ ప్రదర్శన యోగ్యంకావు. నాకు బహుమతి తెచ్చిపెట్టిన నాటకం, ప్రేక్షకులని ఆకట్టుకోలేక పోవటం, నాకు స్వయంగా తెలుసు. "కొత్తగడ్డ"లోని నాటికలు చదువుకు ఆనందించేందుకు బావుంటాయి. ఇంగ్లీషు నాటకాల టెక్నిక్‌తో, గ్రామీణ రైతుల జీవితలు చిత్రించారు నార్ల - అది కూడా కృష్ణా గుంటూరు జిల్లాల మాండలికంలో. ప్రదర్శనానుకూలమైనప్పుడే నాటకం రక్తికడుతుంది - అటువంటి రక్తిమ, నార్ల నాటకాలలో కనిపించదు. అవి ఎవరికివారు చదువుకు ఆనందించేందుకు మాత్రమే" - అన్నారు వివి నరస రాజు.... 'సాహూతిక స్వప్రహాగల మేధావి'గా నార్ల గురించి ఓ అంజనేయులు తయారు చేసిన 'పేపర్' (ప్రసంగ పాఠం), సోదాహరణంగా, నార్లవారి అభిప్రాయాల ధారతో ఘనంగా, ప్రశంసనీయంగా ఉంది. ఆయన అంత కష్టబడి తయారు చేసిన ప్రసంగం, పూర్తిగా చదివే వ్యవధి లేకపోయింది. అణిముత్యాలాటివి అక్కడక్కడ కొన్ని చదివారు. విద్వద్గోష్ఠిలో చదవదగు చక్కటి పరిశీలనాత్మక వ్యాసమది.... "పసందైన పదముల శోభ, రూపకల్పన, చిత్తశుద్ధి, చిక్కని చీకటి చీల్చగ పెట్టిన దీపము లాటి ఆయన పద్యాలలో ముక్తకాల లక్షణం కనిపిస్తుంది. 'నార్లవారి మాట

వాస్తవమ్ము' నుంచి 'నవయుగాల బాట నార్ల మాట'' వైపుగా పయనించడంలో, ఒక జీవితకాలపు ఘర్షణ, అన్వేషణ, సత్యశోధన, కవితాయాత్ర కనిపిస్తాయి. ఆయన కవితా ఝరిలో హృదయంగమ గీతిక కనిపిస్తుంది'' - అన్నారు చిన్నికృష్ణయ్య. కార్యక్రమ ప్రయోక్త (కంపీరర్) పప్పు వేణుగోపాలరావు, 'ఎనిమిది గంటలకు ఈ హాలు యిచ్చేయాలి; అంచేత, ఎనిమిది దాటకుండా సభ ముగుస్తుంది'' - అని మొదట్లో చెప్పారు. ఆ ప్రకారమే జరుగుతుందనుకున్నాం. ఎనిమిదిం పావుకి వచ్చేయవలసి వచ్చింది. అంచేత త్రిపురనేని వెంకటేశ్వరరావు ప్రసంగమూ మల్లిక్ వందన సమర్పణ వినగల అవకాశం లేకపోయింది... నార్ల వెంకటేశ్వరరావు జర్నలిస్ట్, కథా రచయిత, వ్యాస రచయిత, నాటక రచయిత, ఎడిటర్, సాహితీ వేత్త, కవి, ప్రజాహితైషి, మహామేధావి, విశ్వమానవ గీతిక ఆలాపించిన నవయుగ వైతాళికుడు, తెలుగు పత్రికారంగంలో ఆయన తీర్చిదిద్దిన ప్రఖ్యాతులు ఎందరో ఉన్నారు. రష్యన్ కథలు, స్వదేశ

సంస్థానాలు - ఆయన తొలిరచనలు. ఈ పుస్తకాల గురించి త్రిపురనేని వారు చెప్పారేమో తెలీదు. రెండూ అనువాద రచనలే! కాని, వాటి ప్రచురణానంతరం, ప్రభుత్వం తెచ్చిన వొత్తిడి, యితర రాజకీయ దుమారాలూ కారణంగా, మద్రాసు వచ్చి, నిలదొక్కుకున్న నార్ల వెంకటేశ్వరరావుని ఈ మహానగరం, ఒక విఖ్యాత పురుషునిగా చేసింది. ఆయన 'బెస్ట్ ఇయర్స్' 'ఆంధ్రప్రభ' ప్రాంగణంలోనే గడిచాయని చెప్పవచ్చు. ఆ తర్వాత విజయవాడ (ఆంధ్రజ్యోతి), హైదరాబాదు.... నార్లవారి లైబ్రరీని పోలినది ఆంధ్రాలో మరింకెవరూ సేకరించినట్లు తోచదు. నార్ల పేరు చెప్పగానే ఎన్ని జ్ఞాపకాలో, ఎన్నెన్ని జ్ఞాపకాలో!

. . . . . 02

రాగా రికార్డింగ్ కంపెనీవారి (23 - సి, రోడ్ 12 యమ్మెల్యేకాలనీ, బంజారాహిల్స్ హైదరాబాదు) దీపికా ప్రొడక్షన్స్ 'రేపటి కొడుకు' చిత్రంలోని పాటల కాసెట్‌ని (వెల : రు 37-00) సుప్రసిద్ధతార జయసుధ రిలీజ్ చేయగా మొదటి కాసెట్ సంగీత దర్శకులు చక్రవర్తి అందుకున్నారు. పామ్‌గ్రోవ్‌లో జరిగిన ఈ ఫంక్షన్ సింపుల్‌గా దీర్ఘమైన ఉపన్యాసాలు లేకుండా బావుంది. పాటల రచయితలు : జాలాది, నారాయణ వర్మ, అప్పలాచార్య, సంగీత దర్శకులు : కృష్ణ - చిత్ర. డి డి ప్రసాద్ నిర్మాతగా, ముత్యాల సుబ్బయ్య దర్శకత్వాన వెలువడుతున్న ఈ చిత్రంలో, కిస్సు మిస్సు బస్సు, జనంలోకి వస్తుంది, రాములాలి, కొంపలో, సిటి కెడంత - మొత్తం ఐదు పాటలు వున్నాయి నాయికా నాయకులు జయసుధ, చంద్రమోహన్. .. పి ఆర్ ఒ : అర్జునరావు.

. . . . . 10

అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ATA) 1992 జులై 3, 4, 5 తేదీలలో న్యూయార్కు నగర సమీపాన జరుపనున్న ప్రపంచ తెలుగు మహాసభల వివరాలు తెలిపేందుకు కోదండపాణి స్టుడియోలో ప్రెస్ మీట్.... ఈ అసోసియేషన్ ముఖ్య కన్వీనర్ శివరామి రెడ్డిని, యస్పి బాలసుబ్రహ్మణం (ఇండియాలో ఈ సభల కోఆర్డినేటర్) పత్రికలవారికి పరిచయం చేశారు. 32 ఏళ్ల క్రితం ఈ మద్రాసునుంచి ఉన్నత విద్య కోసం అమెరికా వెళ్లిన శివరామిరెడ్డి వైద్య విజ్ఞాన పరిశోధకునిగా అక్కడే స్థిరపడ్డారు. శివరామిరెడ్డి - సుభాషిణీ దంపతులకు ముగ్గురు పిల్లలు - అక్కడ జన్మించారు గనుక ముగ్గురూ అమెరికన్ సిటీజన్స్. పెద్దబ్బాయికి ఈ మధ్యనే ఒక గుజరాతీ అమ్మాయితో వివాహమయింది. ముగ్గురూ వారి వారి ఉద్యోగాలలో ఉన్నారు. తెలుగు అసోషియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా (TANA) ప్రారంభకులలో ఈ దంపతులు వున్నారు; ఇప్పుడూ

'టానా' లో సభ్యులే! 'టానా' కాన్ఫరెన్స్ 1993 జులై మొదటి వారంలో జరుగుతుంది; ఈ 'ఆటా' (ATA) కాన్ఫరెన్స్ 1992 జులైలో జరుగుతుంది... "అమెరికాలో ఒక లక్షమంది ఏషియన్ ఇండియన్స్ వున్నారు - అందులో తెలుగు వారు అరువేలకు పైగా ఉంటారు.... భారతదేశం మాకు విద్యా సదుపాయాలూ విజ్ఞానావకాశాలూ యిచ్చి, బయట ప్రపంచంలోకి పంపింది. మా వైజ్ఞానిక సంపద, ఆర్థిక సంపద మాతృ దేశవాసులతో సముచిత రీతిని పంచుకోవాలనిపించడం సహజం. అంచేత 'యన్ ఆర్ ఐ, లగా (Non - Resident Indians) మేము పుట్టిన దేశానికి ఏం చేయగలము? పెరిగిన ప్రాంతాలకు ఏ విధంగా సహాయ పడగలం?' - అనే అంశాన్ని నిర్మాణాత్మకంగా రానున్న సమావేశంలో చర్చిస్తాము. అంతే కాదు, మా పిల్లలకు తమ స్వజాతీయ సంస్కృతీ వాహిని, ప్రాచీన కళా స్వరూపాలు తెలియాలి. అందుకని, యితర ప్రతినిధులతో బాటు వేర్వేరు కళా రంగాలలోని ప్రసిద్ధులని ఆహ్వానిస్తున్నాము. అమెరికాలోని తెలుగు వారే కాదు, వివిధ దేశాలలోని తెలుగు



## 'జగతి' చందా రూపసు

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు- మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ........................................................

అడ్రసు ........................................................

........................................................

........................................................

తేదీ : సంతకం

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004



వారు ఈ ప్రపంచ తెలుగు మహా సభకు వస్తున్నారు," - అని తెలిపారు శివరామిరెడ్డి. "టానా, ఆటాలు పోటీ సంస్థలా?" అనే ప్రశ్నకు, "ఎంత మాత్రం కాదు - సోదర సంస్థలు; ఒకదానికొకటి చేదోడుగా వ్యవహరిస్తుంది" - అన్నారాయన. శివరామిరెడ్డి దంపతులు తలపెట్టిన బృహత్ కార్యం విజయవంత మవాలని అభిలషిస్తున్నాము.

. . . . . 12

"అపరాధముల నోర్వ సమయము - కృపజూడు ..." అనే త్యాగరాయ కృతిని, ఎంతో చక్కగా, కంఠంలో కరుణ వొలికిస్తూ, శర్వాణీ సంగీత సభవారు కస్తూరి శ్రీనివాసన్ హాలులో (మినీ మ్యూజిక్ అకాడెమీ హాలు) ఏర్పాటు చేసిన ప్రోగ్రామ్‌లో పాడారు విష్ణుభట్ల సరస్వతి ... ఆ తర్వాత పివియస్ శేషయ్యశాస్త్రి తన గంభీర గాత్రంతో, 'నీ మాయ తెలియ తరమా ...', 'ఏమయ్యా రామా....', 'నీ సొగసు చూడ....' వంటివి పాడి శ్రోతలను సంతోషపెట్టారు .... ఔత్సాహికులకు ప్రోత్సాహమిచ్చే 'శర్వాణీ' వారి కృషి అభినందనీయం.

. . . . . 13

పొట్టి శ్రీరాములు హాలులో అమెరికన్ తెలుగు అసోషియేషన్ శివరామ రెడ్డి సుభాషిణీలు ప్రెస్‌నీ, కొందరు ప్రముఖులనీ కలుసుకున్నారు. హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్, ఆంధ్రప్రభ, ఈనాడు మున్నగు దిన పత్రికల ప్రతినిధులు, ఈ అసోషియేషన్ గురించీ, 'యన్ ఆర్ ఐ'లు ఏవిధంగా తాము పుట్టిన దేశానికి తోడ్పడుచూవుకుంటున్నదీ ప్రశ్నలు వేశారు. ప్రపంచ తెలుగు మహాసభల ముఖ్య కన్వీనరు శివరామ రెడ్డి వారి ప్రశ్నలన్నిటికీ విశదంగా సమాధానం చెప్పారు. స్త్రీల సమస్యలు ఈ సభలలో ఏవిధంగా చర్చింపనున్నదీ సుభాషిణి చెప్పారు.

. . . . . 14

న్యూయార్కులో ఉన్న నేషనల్ డాన్స్ ఇన్‌స్టిట్యూట్ చరిత్ర ప్రసిద్ధమైనది. 1978లో దీనిని స్థాపించినది కొరియోగ్రాఫర్ జాక్విస్ యాంబొయిసి, విశేషానుభవం గల నాట్య కళాకారుడు; చిన్న పిల్లల మనసు నాట్యం వైపు మళ్లింపడం ద్వారా, వేర్వేరు దేశాల మధ్య, విభిన్న సంస్కృతుల మధ్య సుహృద్భావం పెంచ గల అవకాశమెంతో ఉందని మన స్ఫూర్తిగా నమ్మే నాట్యాచార్యుడాయన. సాలీనా పదిహేనువేల మంది బాలబాలికలు అనేక స్కూళ్లలో చదువుకుంటున్న విద్యార్థినీవిద్యార్థులు, నాట్య శిక్షణ పొందేందుకు అప్లయ్ చేస్తారు. అందులో వెయ్యిమందిని ఎన్నుకుంటారు; ఆ వెయ్యిలో నాలుగు వందలు మాత్రమే ఉత్తీర్ణులవుతారు. పోయిన సంవత్సరం 'యాంబొయిసి' మద్రాసు వచ్చినప్పుడు ధనంజయ దంపతుల 'భారత కళాం

జలి అకాడమీ'లోని అయిదుగురు విద్యార్థినులను, 1991 లో జరిగిన 'ఈవెంట్ ఆఫ్ ది ఇయర్'కి ఎన్నిక చేశారు. 'చక్ర' నృత్య నాటికలో (Chakra - A Celebration of India) వీరు పాల్గొని, ఎనిమిది ప్రదర్శనలిచ్చి పాశ్చాత్య ప్రేక్షకుల ప్రశంసలు పొందారు.... సంవత్సరాని కొకసారి జరిగే ఈ నాట్య ప్రదర్శన లో పాల్గొనేందుకు, చైనా, ఆస్ట్రేలి యా, సోవియట్ యూనియన్ నుంచి లేత వయసు పిల్లలు వస్తారు. ఈ సెలక్షనులకి, 'విద్య - సంస్కృతి' విభాగానికి చెందిన ఒక సబ్ కమీ షన్ ఉంది. అమెరికన్ సెంటర్‌లో ఈ అయిదుగురు అమ్మాయిలూ తాము అమెరికాలో యిచ్చిన ప్రదర్శనలోని భాగాలు చూపారు. పాశ్చాత్య, భారత నాట్య రీతులకు వీరు ఒక విధంగా వారధి వలె భాసించారు. ధనంజయ దంపతులు తయారుచేసిన విద్యార్థి నులు భారతదేశ ప్రతిష్టను యినుమ డింప జేశారనడంలో సందేహం లేదు

న్యూయార్కులో యిచ్చిన ప్రద ర్శన వీడియో చూపారు ఆహూతులకు. వీడియోలో మాళవికా సారాభాయ్ తమ ప్రయత్నంలోని విశిష్టత చెప్పారు; శాంతా ధనంజయన్ తన నాట్య విద్యతో సమ్మోహ పరిచారు....

విశాలాక్షి జివిశాస్త్రీ (కొ ఠా రి సుగర్స్) దంపతుల కుమారుడు చి॥ గోపాలకృష్ణ, హనుమంతరావు దంప తుల (బి ఎ ఆర్ సి - బొంబయి) కుమార్తె సౌ॥ కామేశ్వరికి డిసెంబరు 12 ఉదయం 4 గం॥ 15 ని॥లకు తులా లగ్నాన తెనాలిలో వివాహం జరిగింది. ఈ సాయింత్రం వుడ్ లాండ్స్‌లో రిసెప్షన్ .. నూతన వధూవరులకు మా శుభాశీస్సులు.

. . . . . 15

మాథమెటీషియన్, మద్రాసు యూనివర్సిటీ రామానుజమ్ ఇన్‌స్టి ట్యూట్‌లో ఉద్యోగిని, ఉన్నత విద్యకై రెండుసార్లు స్టేట్స్ వెళ్లివచ్చిన గణిత శాస్త్ర వేత్త, మాయింట్లో అందరికీ సన్నిహితురాలైన విజయ లక్ష్మి (Dr Vijaya L. Mannepalli) హాస్టల్సూ అద్దెయిళ్లూ మారలేక, తన కంటూ ఒక నివాసం, స్వంతయిల్లు, దుర్గాబాయి దేశ్‌ముఖ్ రోడ్‌లోని 'స్వాతీ టవర్స్'లో ఏర్పాటు చేసు కుంది. స్వంతయిల్లు అనగా ఈ రోజులలో ఆధునిక వసతులుగల 'టు-బెడ్ రూమ్ - ఫ్లాట్'... ఇవ్వాళ మధ్యాహ్నం రెండున్నరకి 'హౌస్ - వార్మింగ్' - శుభ్రమైన గాలీ వెలుతు రూతో చాలా సౌకర్యంగా ఉంది - ఇన్నాళ్ల నిరీక్షణ ఫలించింది. సింగిల్ లేడీకి యింతకు మించిన యిల్లు అనవ సరం. మన ఫ్రెండ్స్ వృద్ధిలోకి రావటం మనకెంతో ఆనందం.... విజయలక్ష్మికి మా మనఃపూర్వక శుభాభినందనలు.

"నేను సినిమాలో ప్రవేశించి 26 ఏళ్లయింది. బియన్ రెడ్డి స్కూలు నుంచి వచ్చినవాణ్ణి. లాజిక్ లేని చిత్రాలు చూస్తూంటే ఎంతో నిరాశ

కలుగుతుంది. కాని, ఒక్కోసారి కలి కాలం, రేపటి కొడుకు వంటి చిత్రాలు తలుచుకుంటే, మంచిరోజులు రాబో తున్నాయనే ఆశ కలుగుతుంది. డబ్బు కోసం వేషం వేయడం వేరు, పాత్రలో లీనమై తృప్తి జెందడంవేరు.... ముత్యాల సుబ్బయ్యగారి వంటి దర్శ కులు, డిడి ప్రసాద్‌గారి వంటి నిర్మా తలు నావంటి వారిలోని నిస్పృహ పోగొట్టి ఆశాదీపం వెలిగిస్తున్నారు ... వ్యాయామంలో నాకు శిక్షణ నిచ్చిన 'జివిజి'కి అప్పుడే అరవై ఏళ్లు వచ్చా యంటే నమ్మలేకుండా వున్నాను.... కాలమెంత తమాషాగా పరుగెడు తుందో! ...." అన్నారు చంద్ర మోహన్, హొటల్ నవీన్ రూఫ్ గార్డెన్ మీద ఏర్పాటు చేసిన పత్రికా సమావేశంలో...నాలుగున్నరకి అనుకున్నది అయిదూ యిరవైకిగాని ప్రారంభం కాకపోవడం, ఆరుగంట లకి మరొక ముఖ్యమైన మీటింగు వుండటమూ వల మిగతా వక్తల ప్రసంగాలు వినే అవకాశం లేక, పి ఆర్ ఓ అర్జునరావుకి చెప్పి, మధ్యలో వచ్చేయవలసి వచ్చింది.

"అవిభక్త కుటుంబంలో అన్నగారి పెత్తనం అధికమైతే, తమ్ముళ్లకి ఊపి రాడనట్లే, మద్రాసు నగరంలో తమిళ ప్రజ ఎక్కువ వుండటమూ, పాలనా వ్యవహారాలలో వారి ప్రమేయం ఎక్కువ అవటమూ వల్ల తెలుగువారు కాస్త వుక్కిరి బిక్కిరయారు. అదలా వుంచి, కాంగ్రెస్ మహాసభ ప్రతి సంవత్సరమూ 'భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ తీర్మానం' విధిగా పాస్ చేస్తూ వుండేది. 1937లో కాంగ్రెస్ వారు మొదటిసారిగా అధికారం రుచి చూశారు. అంతవరకూ మద్రాస్ ప్రెసిడెన్సీకి ముఖ్య మంత్రులైన పానగల్లు రాజా, మునుస్వామి నాయుడు, బొబ్బిలి రాజా మున్నగు వారు తెలుగువారే నన్న సంగతి మనం మర్చిపోకూడదు. అసలీ చెన్న పురిని ఆంగ్లేయులకి అమ్మినది తెలుగు వాడు.... రెండవ ప్రపంచ యుద్ధ ప్రకటనతో, కాంగ్రెస్ మంత్రి వర్గాలు రాజీనామా చేయడం, మళ్లీ సత్యా గ్రహోద్యమం - 1947 ఆగస్టు 15న మనకు స్వాతంత్ర్యం వచ్చేదాకా ఈ భాషారాష్ట్ర నిర్మాణ వ్యవహారం అడుగున పడిపోయింది.... స్వదేశ సంస్థానాల విలీనం అయాక కూడా, కాంగ్రెస్ నాయకులు తమ అధికారాల వేటలో, అధికారాల పంపకంలో, కజ్జాలలో నిమగ్నులై ఉన్నారు. భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణం జరగాలని పైపై కబుర్లేగాని ఏ ఒక్కరూ ఘట్టిగా పూనుకోలేదు. రాజకీయాల తో సంబంధం లేని ఒక సర్వ సామాన్య గాంధేయవాది, సబర్మతీ ఆశ్రమ కాలంలో బాపూజీ వల్ల ప్రభావి తుడై, త్రికరణశుద్ధిగా ఆయన అడుగు జాడలలో నడిచిన పొట్టి శ్రీరాములు, 52 రోజుల తన ఆమరణ దీక్షతో, భాషారాష్ట్ర స్వప్నాన్ని నిజం చేశాడు. ఒక్క ఆంధ్ర రాష్ట్రమే కాదు - భాష ప్రాతిపదికగా దేశంలోని మిగతా రాష్ట్రాలన్నీ ఏర్పడ్డాయి - తమిళ

నాడు, కేరళ, కర్ణాటక, మహారాష్ట్ర - ఆవిధంగా! పోతే, ఆయా ప్రాంతీయ సంస్కృతి, దేశీయ సంస్కృతికి, సమైక్యతకు, సమగ్రతకు దోహదకారి కాగలదని ఆశించారు. కాని, అనుకున్న దొకటి, అయిందొకటి! ప్రతి భాషారాష్ట్రమూ తను ఒక 'సావరిన్ స్టేట్'గా ప్రవర్తించబోతోంది. ఈ విచ్ఛిన్నకర ధోరణులే అస్సామ్, కాశ్మీర్, పంజాబులలోని అలజడులకు హేతువు. అమరజీవి పొట్టి శ్రీరాములు మహాపురుషుడు, త్యాగధనుడు, ఆదర్శప్రాయుడైన గాంధేయవాది. కాని, ఆయన తన ఆత్మాహుతితో యిచ్చిన కానుకను, దేశం యావత్తూ దుర్వినియోగం చేసింది. భాషారాష్ట్రాల విషయమై పునఃపరిశీలన గావించవలసి వుంది" - అన్నారు సభాధ్యక్షత వహించిన జస్టిస్ పి వేణుగోపాల్, పొట్టి శ్రీరాములు 39వ వర్ధంతి సందర్భంగా, ఆ మహనీయుని స్మారక మందిరంలో! బహుముఖ వ్యాపార వేత్తగా, తను ఆర్జించిన ధనంలో 90 శాతం ధర్మకార్యాలకు కేటాయించిన కౌతా సూర్యనారాయణ రావు సిసలైన పుణ్యజీవనుడు - అన్నారు వేణుగోపాల్ - ఆయన చిత్ర పటావిష్కరణ గావిస్తూ.... ప్రారంభంలో వేదపారాయణ తర్వాత, కార్యదర్శి వై యస్ శాస్త్రి స్వాగత వచనం.... 1953లో మోచర్ల రామకృష్ణ కవి రచించిన 'అమరజీవి పద్య సంపుటి'ని విడుదల చేశారు. పప్పు వేణుగోపాలరావు. తన సంస్కృత

భాషాకవిత్వంతో రమణ మహర్షిని విశాల భారతావనికి పరిచయం చేసిన కావ్య కంఠ గణపతిముని చిత్రపటాన్ని ఆవిష్కరించారు శంకర నారాయణన్ .... "మద్రాసు కార్పొరేషన్ కౌన్సిలర్ గద్దె రంగయ్య నాయుడు, అనేక సార్లు జైలుకి వెళ్లిన జాతీయ వాది. ప్రజాసేవ పరమార్ధంగా గలది పుర పాలక సభ్యత్వం అని మనసా వాచా నమ్మిన కర్మవీరుడాయన. సత్యమూర్తి కాలంలో కూడా తెలుగు తమిళ విభేదాలు పురపాలక వ్యవస్థలో ఉండేవికాదు. వాటి అంకురార్పణే, తెలుగు వారిలో తమకు అన్యాయం జరుగుతోందనే అభిప్రాయానికి తావిచ్చింది. నెమ్మది నెమ్మదిగా అది ప్రత్యేక రాష్ట్రోద్యమం వైపు దారి తీసింది" - ఆర్ ఆర్ దళవాయి, గద్దె రంగయ్య నాయుడు చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ. 'జీవన్ కాలమ్' గొల్లపూడి మారుతీరావు, నార్ల వెంకటేశ్వర రావుతో తనకు గల పరిచయం చెబుతూ ఆయన చిత్ర పటాన్ని ఆవిష్కరించారు. వందన సమర్పణ మల్లిక్.... పొట్టి శ్రీరాములు ఆంధ్ర రాష్ట్రం కావాలన్నారుగాని మద్రాసు వొదులుకుందామని అనలేదు. కాని, వ్యక్తుల ఆకాంక్షల పట్ల సానుభూతి ఉండదు చరిత్రకు. మొదట కర్నూలులో మకాం పెట్టినా, ఆ తర్వాత ఆంధ్ర ప్రదేశ్‌గా హైదరాబాదు చేరుకుంటాం - అని మద్రాసు విషయం మాట్లాడకుండా వూరుకున్నారు అప్పట్లో! అయితే, ఈనాడు ఈ భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనే కేంద్రానికి పరీక్ష పెడుతోంది. మన ఎన్నికల విధానమూ, భాషా రాష్ట్రాల స్వరూపమూ మారితేగాని ప్రజాస్వామికం బలపడదని నమ్మేవారు చాలా మంది కనిపిస్తున్నారు.

. . . . . 17

మమతల వల్ల బాధలు తప్పవు. కానీ, మమతలు పెంచుకోకుండా మనుగడ సాగదు ; జీవితంలో స్వారస్యం వుండదు. పూలతీగెల్లాటి ఈ మమతా బంధాలే బ్రతుకు బాటలో పచ్చదనం తెస్తాయి 'ఎదమెత్తనాటకు' సాయపడుతాయి. 'చిన్నమణి' తర్వాత కుక్కను పెంచకూడదను కున్నాం. కాని, ఒకరోజు పొద్దుట ఆరు గంటలకు వికెట్ గేటులో నుంచి కాంపవుండ్‌లోకి వచ్చి, గుమ్మం ముందు నిలబడి, 'కుయ్ కుయ్' మని సన్నగా పిలుస్తున్నా పదిహేను రోజుల కూనకు, నాలుగు చుక్కల పాలు పోయకుండా ఎవరుండగలరు ? పాలు తాగి, కాస్త తేరుకున్న ఆ కూనని చూసి, మా హౌస్‌మెయిడ్ అలిమేలు, అయిదుగురు పిల్లల తల్లి, 'భగవంతుడే దీనిని మన యింటికి పంపించాడు - లేకపోతే, వెతుక్కుంటూ యిది ఈ కాంపౌండ్‌లోకే ఎందుకు వస్తుంది ?' అంది. 'నీ బాధ్యతతో నీవు పెంచు తానంటే నాకేమీ అభ్యంతరం లేదు' - అంది, అప్పటికే కొంచెం మెత్తబడ్డ మాలతి. ఆవిధంగా 'షీబా' నాలుగేళ్ల క్రితం మాయింట్లో ప్రవేశించింది.

ఇంట్లో అందరికే కాకుండా, ఇంటికొచ్చే మిత్రులందరికీ అభిమాన పాత్రురాలయింది. పెర్‌ఫ్యూమ్ రాసుకున్న స్త్రీలు వస్తే వాళ్ల కాళ్ల దగ్గిర వొదిగి కూర్చునేది. వి ఎ కె రంగారావు వారం పదిరోజుల కొకసారి దానిని విధిగా పల్కరించి వెళ్లేవారు. ఆల్విన్ రాజారావు వస్తే, అతను మళ్లీ స్కూటర్ ఎక్కేదాకా వొదిలి పెట్టేది కాదు.... ఒకసారి పిల్లలు పెట్టాక గాని అపరేషన్ చేయకూడదన్నారు. రెండేళ్ల క్రితం నాలుగు పిల్లల్ని పెట్టింది ; మొదటి వారంలోనే ఆ నాలుగు కూనల్ని ఎవరెవరో పెంచుకునేందుకు తీసుకువెళ్లారు .... ఆ తర్వాత దానికి అపరేషన్ - వారం రోజులు హాస్పిటల్ స్టే; దానికొక చిన్న రూము ; పౌష్టికాహారం. ఆ తర్వాత ఆరోగ్యంగా ఇంటికొచ్చింది.... రెండు వారాల క్రితం వరసగా రెండురోజులు పాలు తాగక, ఏమీ తినకపోతే, బ్లూక్రాస్‌కి తీసుకువెళ్లారు ; అక్కడి డాక్టరు యింజక్షనూ మందులూ యిచ్చి, రెండు మూడు రోజులలో నార్మల్ అవుతుందన్నారు. మరో నాలుగు రోజులు పోయాక దగ్గిరలో వున్న డాక్టరు వద్దకు తీసుకువెళ్తే జాండీస్ అన్నారు. అయిదారురోజులు బలవంతాన సిరెంజితో మందూ పాలూ పోశారు. రికవర్ అవుతున్నట్టుగా కనిపించింది ; మామూలుగానే తిరుగుతూండేది ; కాని, ఆహారం పడక పోవటం వల్ల వెనకటి చలాకీతనం లేదు. 'జిటి'కి విజయవాడ వెళ్తున్నాము. కారు దాకా తోకాడించుకుంటూ వచ్చి పంపే షీబా నీరసంగా వున్న కళ్లతో చూసింది - ఋణానుబంధం తీరిపోయే సమయమాసన్నమైందన్నట్లుగా ! గురువారం రాత్రి ఒంటిగంటకు, తిరిగివచ్చాక తెలిసింది - తను ఎంత నెమ్మదిగా 'కుయ్ కుయ్' మంటూ గుమ్మం ముందుకు వచ్చిందో, అంత నెమ్మదిగానే ఎవరికీ ఎటువంటి యిబ్బందీ కలిగించకుండా, తన ఊపిరి అనంత వాయువులోకి వొదిలేసిందని ! .... ఆరేళ్ల క్రితం 'మణి' గురించి అనుకున్న మాటలే గుర్తుకొస్తున్నాయి (డైరీ - జనవరి 31, 1986)".... ఎనిమిదేళ్లు వచ్చిన 'మణి' అతి జాగ్రత్తగా రోడ్డు క్రాస్ చేసేది. మరి ఏమైపోయినట్టు ? కుక్కలకి గుండెజబ్బు రావటం పరిపాటి - హార్ట్ ఎటాక్ వచ్చి కన్నుమూసి వుంటుంది - అన్నారు ఒక మిత్రులు. ఆరునెలలుగా తప్పిపోయిన సావిత్రీ వాళ్ల పెంపుడు కుక్క నవంబరు మూడో వారంలో తిరిగి రావడంతో మూడు నెలలే కదా, మా 'మణి' కూడా వెనక్కి వస్తుందేమోనన్న ఆశ మాలో చిగురించింది.... శూన్యతని పూడ్చేందుకు మరొక 'చిన్న మణి'ని పెంచుతున్నప్పటికీ, ఎనిమిదేళ్లు మా యింట్లో మసిలి పెరిగిన 'పెద్ద మణి', మా అందరి మనసుల్లోనూ చిరంజీవి. అది ఏమైపోయింది ? మాకు తెలియని తీరులో ఎందుకిలా జరిగింది ? అక్టోబరు నెలలో బొంబయి, నాగపూర్, హైదరాబాదులలో మేమిద్దరం పొందిన

గుర్తింపుకీ గౌరవానికీ యిది ఒక విధంగా మేము చెల్లించవలసిన మూల్యమా? మేము తన మమతనీ, విశ్వాసాన్నీ, ఆపాయతనీ మాత్రమే పొందాలనీ, పెద్దతనం వచ్చి అశక్తురాలై మమ్మల్ని బాధ పెట్టకూడదనీ, హాయిగా పరుగులు పెడుతూ అంతర్ధానమైపోయిందా మణి? ఎందుకలా మాయమైపోయింది? ఎక్కడికెళ్ళిపోయింది? ఏమైపోయింది? ఆ నేత్ర ద్వయంలోని అపూర్వ భావ వ్యక్తీకరణ, మమ్మల్ని అనవరతం ఆశ్చర్యంలో ముంచుతుండేది. మాటలెందుకు ఆ కళ్లు చెప్పే సందేశం ముందు? ఎనిమిదేళ్లు పెరిగిన మణి ఎక్కడికి వెళ్లిపోయిందో! ఎవరు చెబుతారు? ఎవరికి తెలుసు? ఇటు శాంతోమ్ చర్చి నుంచి, అటు తంబీ ఫార్మశీ దాకా 'మణి'ని తెలియని వారు లేరు. మీ 'మణి' కనిపించడం లేదేమండీ? – అని ఎందరో అడిగారు. ప్రశ్నార్థకమై, ప్రీతి పాత్రమై, ప్రేమనికుంజమై స్మృతి మాలలో ప్రసూనమయింది"... అటువంటి మణిని కలుసుకునేందుకు వెళ్లింది షీబా. 'మనిషికి సౌమ్యత నేర్పుతాయి జంతువులు' అని వాల్ట్ విట్‌మాన్ అన్నది అక్షరాలా నిజం కదా!

. . . . 20

"సంగీతం భగవంతుని సందేశం గననే నాదోపాసన ద్వారా తరించిన మహనీయులు, వాగ్గేయకారులు మనకి కనిపిస్తారు. మిగతా ప్రాణులకీ నరునికీ గల తేడా ఏమిటంటే, నరుడు మాట్లాడగలడు. ఆ మాటలని ఛందోబద్ధంగా కవన మల్లి, పాటలు కట్టగలడు. తన గళాన పలికించగల సప్తస్వరాలతో ఆ వాక్సుధను నాద బ్రహ్మోపాసనగా మలచగలడు. తను ఆనందిస్తూ, వింటున్న వారిని ఆనంద పరచగలది గానమొక్కటే, అని చెబుతుంది ఛాందోగ్యోపనిషత్ ... ఈ శతాబ్ది ఇరవైలలో భారతీయ సంస్కృతి, సంగీత నాట్యాదుల ద్వారా లలితకళల ద్వారా, నిజాయతీ పాలన కారణంగా మరుగు పడ్డ తన నిజ స్వరూపాన్ని ద్వారా తెలుసుకొనేందుకు ప్రయత్నించింది. సంఘసంస్కరణోద్యమం ద్వారా విస్తరించిన చైతన్యం, కళాస్వరూపాల ద్వారా పరిఢవిల్లింది. స్వాతంత్ర్యోద్యమం ఒక వంక సాగుతూండగా, జాతీయ కళలకు, ముఖ్యంగా సంగీతానికీ నాట్యానికీ ఒక వినూతన గౌరవం ఏర్పడింది. వీటిని ప్రోత్సహించే సభలను సామాజికులు, రసజ్ఞులు ఆదరించారు. మద్రాసులో ఈ డిసెంబరు సీజనులో జరిగే మాదిరి సంగీత నాట్యోత్సవాలు ప్రపంచంలో మరింకే పట్నంలోనూ లేవు. ఆ విధంగా అరవై ఏళ్ల క్రితం వేసిన విత్తనం ఫలించింది. అయితే, యివి ఆనందిస్తున్నవారు నలభై దాటిన వారేనన్న సంగతి మనం మర్చిపోకూడదు. యువతీ యువకులని ఈ సంప్రదాయ సంగీతమూ నాట్యరీతులూ ఎందువల్ల ఆకట్టుకోలేకుండా

వున్నాయి ? మన సంస్కృతిని, మన జాతీయ వారసత్వాన్ని మన విలువలని తెలుసుకోవాలనే తపన, వాటి ద్వారనే జీవితానికి నిండుతనం చేకూరుతుందనే విజ్ఞత వారిలో ఎందు వల్ల కొరవడుతున్నది ? సినిమా, విడియో, టెలివిజన్, ప్రపంచ వ్యాప్త ప్రసారాలు యిలాటివి మన యువతీ యువకులని తమ వైపు తిప్పుకుంటు న్నప్పటికి స్వజాతీయ కళారూపాలపై వారి దృష్టి మళ్లించవలసిన అవసరం ఎంతైనా ఉంది. సాంస్కృతిక వార సత్వంలోనే ప్రతిజాతీ తన జీవస్పం దనను చూడగలుగుతుంది" — అన్నారు ఎన్‌ఫీల్డ్ ఛెయిర్‌మాన్ విశ్వ నాథన్, ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ వారి 59వ వార్షికోత్సవాన్ని, బాలమందిర్ జర్మన్ హాలులో ప్రారం భిస్తూ !.... '1979లో కళామందిర్ ట్రస్ట్ ప్రారంభించి, ఔత్సాహికులకు అవకాశమిస్తున్న ఎన్‌ఫీల్డ్ విశ్వనాథన్' లలితకళా పోషకులు — సుప్రసిద్ధ 'కళాక్షేత్ర' సంస్థతో ఆయనకు సన్ని హిత బాంధవ్యం ఉంది. ఈ 59వ ఉత్సవాన్ని ప్రారంభించేందుకు ఆయన అంగీకరించడం మాకెంతో సంతోషకారకం.... పారుపల్లి రామ కృష్ణయ్య పంతులుగారి ప్రియ శిష్యులు, త్యాగరాజస్వామి శిష్యపరం పరలోని వారు, సప్తవర్ష ప్రాయం నుంచి తన గానసుధా లహరితో శ్రోతలను మెప్పించిన సంగీతజ్ఞులు, వాగ్గేయకారులు, యావద్భారతంలోను ఇతర దేశాలలోను అనేకానేక సత్కా

# ముఖ చిత్రం



పుష్పించిన చెట్టు సుగంధం వెద జల్లినట్లుగా, మంచిపనులు వాటంత టవే పరిమళిస్తాయి - అనే ఉపనిష ద్వాక్యం కాంగ్రెసువారు నమ్మిన కాలంలో, కామరాజు మంత్రి మండ లిలో 'ఆర్వీ'ది పరిశ్రమల శాఖ. తమిళనాడులోని పారిశ్రామికాభివృద్ధి ఆరోజులలోనే జరిగింది. కృష్ణమీనన్ నాయకత్వాన ఐక్యరాజ్యసమితికి భారత ప్రతినిధి వర్గంలో వెళ్లిన ఆర్ వెంకట్రా మన్, తన వాదనా పటిమతో ఎదుట వారిని ఒప్పిస్తారు - అంతేగాని, ఏనాడూ మాటలతో గాయ పరచరు. సోషలిస్ట్ సిద్ధాంతాలు నమ్మినా, కార్మికసంక్షేమం కోసం, యాజమాన్యా నికి పనివారికి మధ్య సామరస్యం నెల కొల్పేవారు. రాష్ట్రపతిగా అత్యున్నత స్థాన మలంకరించిన ఆర్ వెంకట్రా మన్, గాంధీ నెహ్రూల బాటకు కట్టుబడ్డ ఉదారగుణ సంపన్నులు. వి యస్ శ్రీనివాసశాస్త్రి, రాజాజీ, సత్యమూర్తి - ఈ ముగ్గురి ప్రభా వంతో తన వ్యక్తిత్వాన్ని మలుచు కున్న సుజన జీవనులు. అధికార పీఠం మనశ్శాంతిని చెడగొడుతుందేమోనని ఒకప్పుడు సంశయాకుల చిత్తులు కాగా, కంచి శంకరాచార్యులవారు, ఆయనకు మనోబలాన్ని ఆధ్యాత్మిక స్ఫూర్తిని యిచ్చారు. రాష్ట్రపతి స్థాన గౌరవం మరింత యినుమడింప జేశారు 'ఆర్వీ'



రాలు పొందిన పద్మవిభూషణ్, బాల మురళీకృష్ణకు మా సొసైటీ 'సంగీతకళా శిఖామణి' బిరుదుప్రదానం, మహా విద్వాంసులు పట్టమ్మాళ్, రాజమ్ అయ్యర్ల సమక్షంలో చేస్తున్నది. మా ఆహ్వానాన్ని మన్నించి వచ్చిన అందరికీ సుస్వాగతం' – అన్నారు ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ అధ్యక్షులు ఎంబెరుమన్నార్ చెట్టి.... "ఈ మధ్య కొన్నాళ్లగా కర్ణాటక సంగీత పట్ల ప్రజలకు ఆసక్తి, అభిమానమూ పెరుగుతున్నాయి. భౌగోళిక సరిహద్దులు చెరిపేసే మహత్తం సాధన సంగీత విద్య. స్థిమితంగా కూచుని, శ్రద్ధగా విన్నప్పుడే పాట కచ్చేరి శ్రోతని రంజింపజేస్తుంది. ఆలాపన లోను ఆలకించడంలోను గల అదృశ్య వారధి గుర్తిస్తేనే రాణింపు.... ఈ నాడు సంగీతం నేర్పే కాలేజీలు వున్నాయి. వాటిలో పాఠ్యాంశాలు అమోదకరమైనవే గాని బోధనా పద్ధతులలో మాత్రం మార్పు రావాలేమో ననిపిస్తోంది. ప్రతిభ గల విద్యార్థినీ విద్యార్థులకు ఉపకార వేతనాలు అధిక సంఖ్యలో యివ్వాలి - కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు.... దాక్షిణాత్య సంగీతం 72 మేళ కర్తలు ; హిందూస్థానీ, కర్ణాటక సంగీతాల మధ్య చక్కటి మైత్రి ఉంది. గాన కళను ఈనాడు ఎందరో అభిమానిస్తున్నారు, ఆదరిస్తున్నారు. జనరంజనే గాక సంగీతంలో ఔషధీ లక్షణం ఉంది ; కొన్ని వ్యాధులు నయం చేయగల శక్తి ఉంది. ఆ విషయమై పరిశోధన జరుపుతున్నాను" - అన్నారు పద్మవిభూషణ్ బాలమురళీ కృష్ణ, 'సంగీతకళా శిఖామణి' బిరుదు నందుకుంటూ .... మీనాక్షీమణి భరతనాట్యం మరొకసారి ఎప్పుడైనా చూదామనుకున్నాం.

. . . . . 21

"నాకు 'విజ్‌డమ్'లోని బాటమ్ లైన్స్ (అడుగు నుండే సూక్తులు) ఎంతో యిష్టం. ప్రతిసూక్తి వివేకాన్ని ప్రోది చేస్తుంది. ఇంట్లోని వారందరూ హాయిగా చదువుకోదగు ఆరోగ్యవంతమైన పత్రిక యిది" - అన్నారు జస్టిస్ ఇస్మయిల్, 'విజ్‌డమ్'వారి 19 వ అవార్డ్ స్ఫంక్షన్‌ని, నారదగాన సభలో ప్రారంభిస్తూ! తమిళనాడు గవర్నరు భీష్మనారాయణ సింగ్ సభాధ్యక్షత వహించగా లయన్ యన్నార్ దావె, విజ్‌డమ్ ఇంగ్లీషు సంచిక రిలీజ్ చేశారు. పద్మవిభూషణ్ బాలమురళీ కృష్ణ తెలుగు సంచిక రిలీజ్ చేశారు. ప్రారంభాన నళిని వినాయక్ సితార్. ఎడిటర్ గోవిందరావు ఆహూతులకు స్వాగతం తెలిపారు : ఈ సందర్భంగా రత్నం అండ్ రావ్ ట్రస్ట్‌వారు, ఒకొక్కరికి పదేసి వేలు చొప్పున; లయన్స్ ఐ బాంక్ ట్రస్ట్‌కి, అరంగనార్ హాస్పిటల్ ట్రస్ట్‌కి, దుర్గాబాయి దేశ్‌ముఖ్ పోలీక్లినిక్ - మొత్తం ముప్ఫయివేలు, ఆయాసంస్థల ప్రతినిధుల ద్వారా విరాళాలు అందజేశారు. బాలమురళికి, 1991 విజ్‌డమ్ స్టార్ ఆఫ్ ఇండియా అవార్డు, 'గానకళా ప్రపూర్ణ' బిరుదు యిచ్చారు.... హెూమియో డాక్టరు శ్రీ

రాములు ; సోషల్ వర్కర్ కన్నయ్య; ఉత్తమ ప్రిన్సిపాల్ మీనాక్షి సుందరం; లయన్ పన్నాలాల్ ; రంగస్థల నటుడు చంద్రన్ ; రంగస్థల నటి హేమలత ; హాస్య నటుడు మోహన్ ; వియట్నామ్ వీడు సుందరం ; లయనెస్ సరోజిని చిన్ని కృష్ణన్ ; లియొ మహమ్మదాలీ ; విద్యార్థినీ విద్యార్థులు అరవింద్ కుమార్, సుధ, లీనా, రాజన్, వసుమతి, రేవతి, అరవింద గణేష్, సుభాషిణి, రాజేష్, శ్రీసత్య, తమిళ్‌శెల్వి, దేవి, శ్రీదేవి, ప్రకాష్, అంజు, శుభ, రక్షక్ బరకతాలీ ; నేవీ కాడెట్ రాజ్ ; ఆర్మీ కాడెట్ నారాయణన్ ; అంబాశరణ్ ; సెల్వమ్; శివశంకర్ ; అంబులెన్స్ సుబ్రమణియన్ ; స్కౌట్ మనోకరణ్ ; గైడ్ సత్యప్రియ. జానకీ మీనన్ - ఈ సంవత్సరం అవార్డ్ గ్రహీతలు.... వ్యాపార ప్రకటనలూ, సినిమా సంగతులూ లేకుండా, మనసుని ఆహ్లాదపరుస్తూ మనిషిని వివేకవంతుని చేయగల మంచి విషయాలతో, వింతలూ విడ్డూరాలూగాని వాస్తవికాలతో ఇంటికి చిరుకాంతి నిచ్చే వెలుగు దివ్వె విజ్‌డమ్ విజయయాత్ర ఆ ఏటికా ఏడు మరింత ప్రకాశవంతం కావాలని మనసారా అభిలషిస్తున్నాము. కుటుంబ సభ్యుల ఐక్య కృషి, కార్యాలయంలోని వారి సుశిక్షణ, లక్షా పాతికవేలు ప్రతుల అమ్మకంతో విజ్‌డమ్ పత్రికకు అఖండ విజయం చేకూర్చి పెట్టాయి. పిరియాడికల్ జర్నలిజమ్‌లో లయన్ గోవిందరావుది ఒక ప్రత్యేక స్థానం. ఒక సామాన్య మాసపత్రిక, ఏటా యింత భారీఎత్తున ఉత్సవం జరిపి, ప్రజాహితకార్యంగా యిందరినీ గుర్తింపుతో సన్మానించి, పెద్దమొత్తం సేవా సంస్థలకు విరాళంగా యివ్వడం, నిగర్వ నిరాడంబర నిర్మల మనస్కులైన గోవిందరావు వంటివారే చేయగలరు.

—యన్నార్ చందూర్

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము. చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

## చిత్రజగతి

సమీక్ష

అనుపమా వారి
'ప్రాణదాత'

మంత్రిగారికే కాదు, ప్రతిపక్ష నాయకునికి కూడా ప్రాణం పోయడం తన వృత్తి ధర్మం అని ఆదర్శ వంతంగా చెప్పే డాక్టరు చక్రవర్తి (అక్కినేని నాగేశ్వరరావు) గొప్ప సర్జన్ ; యింటికొచ్చేసరికి భార్య కని పించదు. ఆడ పెత్తనం చెలరేగిన ఆ యింట్లో 'పారిపోయింది' అని తల్లి అంటే, 'లేచి పోయింది' అని తోబుట్టువు అందిస్తుంది. తండ్రి (అల్లు రామలింగయ్య) ఒక అసమర్థుడు. తన భార్య (లక్ష్మి) నాలుగేళ్ల కూతురుతో ఎక్కడికి పారిపోయింది, ఈ తల్లీ పిల్లని ఎవరు లేవదీసుకు పోయారు? - అనే ప్రశ్నలతో నిమిత్తం లేకుండానే, డాక్టరు చక్రవర్తి పూర్వస్మృతి కోల్పోయినవాడై, పదిహేనేళ్ల తర్వాత, టక్ చేసుకున్న షర్టూ ప్యాంటూతో మాసిన గడ్డంతో, 'కాస్త అన్నం పెడతారా? పనీ యిప్పిస్తారా?' అంటూ ప్రత్యక్ష మవుతాడు. పూర్వరంగానికీ అసలు కథకీ పొంతనలేదు. అయినప్పటికీ సన్నివేశాల కూర్పు రక్తికడుతుంది. ఇంత గొప్ప సర్జన్ తప్పిపోతే, అతని అసిస్టెంట్‌కి (గిరీష్ కర్నాడ్) గాని, యితర వైద్యులకు, తలిదండ్రులకి గాని అమాకీ తెలుసుకోవాలనే ఆసక్తి కలగక పోవడం ఆశ్చర్యకరంగా ఉంటుంది... తోబుట్టువు కొడుకు (హరీష్), చక్రవర్తి కుమార్తె జ్యోతి (భార్మిళ) ఒకే ఊళ్లో కాలేజీ స్టూడెంట్సయి, డాన్స్ ఫెస్టివల్‌లో పాల్గొని, విపరీత 'ప్రేమికులం - శాంతి కాముకులం - ప్రేమికులం, మాది ప్రేమ కులం' అని డిక్లేర్ చేస్తారు. కూతుర్ని కంటి దీపంలా చూసుకుంటూ, గుట్టుగ్గా బతుకుతున్న చక్రవర్తి భార్య - అంటే జ్యోతి తల్లి - తన కూతురు ప్రేమించిన యువకుని యింటికి స్వయంగా వెళ్లి, అతను తన ఆడబిడ్డ కొడుకని తెలుసుకుంటుంది. ఈమెకి అభ్యంతరం లేదు గాని ఆ యింట్లో వాళ్లు మాత్రం తల్లీ కూతుళ్లని తరిమి కొడతారు... చక్రవర్తి ఆ ఊళ్లోని ఒక జామందు కొడుకు అవిటితనాన్ని బాగుచేసి, ఆయన ప్రోత్సాహ జనితమైన ప్రజా వైద్యశాల నడుపుతాడు. ..... చక్రవర్తి భార్య ఎందుకు యింట్లో నుంచి వెళ్లిపోయినదీ సస్పెన్స్‌లో ఒక భాగం ... సంగీతం: రాజ్ - కోటి ; దర్శకులు : మోహన్ గాంధి : నిర్మాత : కాట్రగడ్డ ప్రసాద్ .... పిఆర్ఓ : జగన్.

# క్రొత్త పుస్తకాలు



'రంగు రంగుల చీకట్లు' - కవితా సంపుటి. రచన: జె బాపురెడ్డి. ప్రచురణ: జయం పబ్లికేషన్స్, ప్లాట్ 10 - రోడ్డు 5, జుబిలిహిల్స్, హైదరాబాదు-34.... వెల: రు 25-00.

వృత్తిచేత ప్రభుత్వోద్యోగి, ప్రవృత్తిచేత కవితా హృద్యోగి అయిన బాపురెడ్డి ప్రాచీన అర్వాచీన తెలుగు సాహిత్య క్షేత్రాలలో అంతర్నేత్రుడైన జివి సుబ్రహ్మణ్యం గారికి తమ ఆదర్శ మైత్రీ చిహ్నంగా ఈ పుస్తకం అంకిత మిచ్చారు. 'పంచ బాణ సంచ', 'ప్రణవ ప్రణయం' - ఈ రెండూ శృంగార ప్రణయానుభూతి శోభితాలైతే, ఈ సంపుటిలోని కవితలు చైతన్య భావ దీపితాలు. 'ఈనాడు ప్రపంచంలో జరుగుతున్న విప్లవాత్మక సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరమైన మార్పులన్నీ, సుసంఘటిత సమగ్ర జీవితాదర్శ ప్రేరితాలు' - అంటారు కవి. శిలలను పూజించే ఏకాంత సేవకుడనని పేర్కొంటూ, పవిత్ర భారత ధరిత్రి ఒడిలో - భయంకర చరిత్ర ప్రభవిస్తున్నదంటారు.

పసుల పాకలో పుట్టిన శిశువు ప్రపంచాన్ని జయించడమే క్రిస్మస్ పండుగ.... కాళ్లు చేతులు ముడుచుకున్న కాలాన్ని కదిలించిన విప్లవ జ్వాల ఇరవయ్యో శతాబ్దం.... శబ్దానికి శబ్దానికి నడుమ వినిపించే నిశ్శబ్దం ఇస్మాయిల్ అయితే, హిమాలయాల ఔన్నత్యం హిందూ మహాసముద్రపు గంభీరత్వం 'విశ్వంభర' (నారాయణ రెడ్డి) వీణాశ్రుతులై మోగుతున్నాయట. రమ్మన్నా వద్దన్నా ఆశల వసంతాన్ని తెచ్చే ఉగాది వంటిది బాపురెడ్డి కవితాధార. ఆ కవితా ప్రవంతిలో మన చుట్టూవున్న వర్తమాన ప్రపంచం వివిధానేక రోచిస్సులతోను, రంగు రంగుల చీకట్లతోను దర్శన మిస్తుంది.

—క్షీరసాగరమ్



'వానజల్లు' కథాసంకలనం. రచన: ఆచంట శారదాదేవి. ప్రచురణ: సాహితీ రచయితల సహకార సంస్థ హైదరాబాదు-35 వెల: రు 15/-.

ఈ పుస్తకంలో ఇరవై ఒక్క కథలున్నాయి. ఈ కథల్లోని పాత్రలు, మనకు నిత్య జీవితంలో ఎదురయ్యే మనుషులు వారి మనస్తత్వాలు ఈతి బాధలు, మానసిక స్థితులు, వారి చిన్న చిన్న కోరికలు,.... చాలా చక్కగా సూటిగా మనసుకు హత్తుకొనేలా రచయిత్రి చెపుతారు. జీవన వాస్తవాలు

అతి సరళంగా స్వచ్ఛంగా వుండి, చదువుకుందుకు - ఉత్సుకతను కల్గి స్తాయి. 'బొమ్మలాట' కథలో రిటైర్డు జవాను, అతని భార్య 'ఆ దేవుడే ఇంత బువ్వ పెట్టుతాడు - దోవ చూపిస్తా' డని నమ్మకంతో, అలాగే బ్రతుకు లాగుతారు. 'త్రాసు' - కథలో ప్రపంచంలో అన్ని సౌఖ్యాలకూ - మూల కారణమైన డబ్బు - దాని చుట్టూ తిరిగే విభిన్న పాత్రల మనస్తత్వాలు చిత్రించారు. 'బిందువు' కథలో వయసు మళ్ళిన మనుషులు - తమకు బిడ్డలు వుండీ - ఒంటరితనంతో బాధ పడుతూ జీవితాన్ని వెళ్ళదీసే దయ నీయమైన పరిస్థితి. ప్రతి కథా పాఠ కుని మనసుని అంతో ఇంతో కదులుస్తూ చక్కటి అనుభూతి మిగుల్చుతుంది.

—అన్నపూర్ణారెడ్డి

## ఈమధ్య అందినవి :

ప్రవక్త సందేశం - రు 4-00; నిర్మాణం - విచ్ఛిన్నం - రు 3-00 .... ఈ రెండూ మౌలానా మౌదూది మాతృకకు అబుల్ ఇర్ఫాన్ అను వాదం; విరిసిన మొగ్గలు - రు 5-00.... మాయిల్ ఖైరాబాదీ మూలానికి సయ్యద్ హుసైన్ అను వాదం; జిమా ప్రసంగాలు - రు 28-00 .... రహ్మత్తె మూలానికి అబుల్ ఇర్ఫాన్ అనువాదం; ఆధునిక ఆర్థిక సిద్ధాంతాలు - రు 12-00.... మౌలానా మౌదూది మూలానికి మలిక్ అనువాదం....పై అయిదూ ప్రచురించినవారు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్ కోట్, ఛత్తా బజార్, హైదరాబాదు-2.

అన్నమయ్య జయంతి ఉత్సవ సంచికలు మూడు. ప్రచురణ: అభి నయ ఆర్ట్స్ అకాడమీ, ప్లాట్ 15, సెక్టర్ 10, మువ్వల వాని పాలెం, విశాఖపట్నం-17.

ప్రొఫెసర్ కోలా రాజ్యలక్ష్మి షష్టి పూర్తి సంచిక.... డా॥ టి రవీందర్ రావు, ఉస్మానియా కాలేజి, హైదరా బాదు.

నాయన - గణపతి ముని జీవిత సంగ్రహ చరిత్ర - పోలూరు హనుమ జ్జానకీ శర్మ.... శ్రీ రమణ సత్సంగము, అనంతపురం.... రు 15-00.

మూడు నగరాలు - లండన్, పారిస్, మ్యూనిక్. దాసరి అమరేంద్ర .... విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, బ్యాంకు స్ట్రీట్, హైదరాబాదు-1.... రు 10-00.

అందుకున్నవన్నీ గాకపోయినా, కొన్నిటి సమీక్షలు ముందు ముందు వచ్చే సంచికలలో వెలువడుతాయి.

పీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

గడిచిన కథ : విశాలకు ప్రమాదం సంభవించడంతో వారి వివాహం వాయిదా పడుతుంది. నాగార్జున చెల్లెలు చందనకు ముహూర్తం పెడతారు. ఆ పెళ్లి పందిట్లో లావణ్య, నాగార్జునలో కృష్ణని చూస్తూ, స్పృహ కోల్పోతుంది- అందరికీ సానుభూతి... (ఇక చదవండి

మలుపు తిరుగుతుంటే నాగార్జున మీద పడి "సారీ... ఈ రోడ్డు అలావుంది," అంది దూరంగా జరుగుతూ, మెయిన్ రోడ్డు దాటాక ఎన్ని సార్లు అలాపడిందో లెక్కలేదు.

"ప్రస్తుతం ఈ మట్టిరోడ్డయినా వుంది. మనం చదువుకునే రోజుల్లో యిదీ లేదు."

ఆమె చెప్పే వాటన్నిటికి మౌనంగా వుంటే బాగుండదని తలూపి నవ్వాడు.

కారు వూరి మధ్యకు ప్రవేశించింది. అక్కడక్కడ పెంకుటిళ్ళు... చిన్న చిన్న మిద్దెలు... పూరిళ్ళు, కరెంటు కూడ వచ్చినట్లుంది. కరెంటు స్తంబాలు పాతిన లైట్లున్నాయి.

"వో... వో..." అంటూ కారు వెనుక పిల్లల పరుగు.

అందరూ తొంగి... తొంగిచూస్తూన్నారు. పిల్లలు వెనుకబడి అరుస్తున్నారు.

అక్కడ ఒక పెద్ద వేప చెట్టుంది. దాని చుట్టూ అరుగు. ఆ అరుగు ప్రక్కగా కారు స్లోగా వెళుతుంటే... ఒకతను వచ్చి... కారు డోర్ మీద చేయివేసి, "ఎవరికోసమొచ్చారు ?" అనడుగుతూ లోపలకు తొంగి చూశాడు. అంతే, మరు నిమిషమే... "ఓరి నాయనో దెయ్యాలు కూడ కార్లో వస్తాయమ్మో !" అంటూ బరబరా పరుగెత్తి వేపచెట్టు ఎక్కేశాడు.

"....ఏందిదా.... దెయ్యాలేంటి... కారేంటి.... ఏరో దొరబాబులొస్తే దెయ్యాలంటావేటి ?" అని అక్కడే అరుగు మీద కూర్చుని నార పేడు కుంటున్న ఆదయ్య తిన్నగా లేచి వచ్చాడు కారు దగ్గరకు.... అరుగు మీదే నిలుచుని నవ్వుతూ... "వాడొట్టి ఎర్రి నాగన్న.... ఏరు గావాలేంటి బాబు ?" అంటూ చూశాడు.... నాగార్జున ఏదో చెప్ప బోయేంతలోనే.... "అంటే అంటే.... బె... బె... బె... దె... దె... దెయ్యాలు ఇప్పుడు నేనేమి చేతును.... నా మెడలో ఆంజనేయ



సవాళ్ళలో విజయం పొందడానికి దృఢ నిశ్చయమే
రిపబ్లిక్ దినోత్సవపు సందోహము.

సామి బిళ్ళ కూడ లేదు"... అంటూ వేపచెట్టు వెనుక దాక్కుని రెండు చేతులతో చెట్టుని ఒడిసి పట్టుకుని కేకలు పెట్టాడు.

"వీడెవరో తెలుసా, బస్సులో మీరు నేనూ పక్క పక్కనే కూర్చున్నామని మీ నాన్నగారితో చెప్పి చీవాట్లు పెట్టించాడు."

నాగార్జునకు అంతా గందరగోళం గా ఉంది.

ఆ అరుగు మీద, గుగ్గిళ్ళు బుట్టలో పెట్టుకుని అమ్ముకుంటున్న ఓ ముసలవ్వ, కారు దగ్గరగా వచ్చి, వాళ్ళను చూచి, "లక్షనంగా చిలకా గోరింకల్లా, రాదో కిష్టులు వస్తె, దెయ్యాలంటారేమిరా.... అమ్మాయి రాదో.... ఎక్కడి కెళ్ళావే ఇన్నాళ్ళు. ఇన్నాళ్ళు....? వీళ్ళందరూ నీవు చచ్చిపోయావనే అనుకుంటున్నారే తల్లి!"

"ఏ ముసలిదాన, చూపు ఆనక నీవేదో వాగుతున్నావు. అవి గాని నిన్ను పట్టుకుంటే ఒకే ఏటు రపీమంటావ్" - చెట్టెక్కినతను అరిచాడు. అప్పటికే కారుమీద రాళ్ళు రువ్వారు. అద్దాలమీద రాళ్ళుపడితే...., లోపల వున్న వాళ్ళకి ప్రమాదమని వాళ్ళను ఆపేందుకు, కారు డోర్ తెరచుకుని, కాలు కింద పెట్టబోయాడు నాగార్జున. వో.... వో అరుపులు.... రివ్వున రాయి వచ్చి నాగార్జున నుదిటమీద పడి రక్తం చిమ్మింది.

"దెయ్యాలకు రక్తం.... కూడా వస్తుందా....?" అని ఒకరి ప్రశ్న.

"రక్తం వస్తే కోపం జాస్తి అవుతాది.... ఇవిగో వేప మండలు - అందరి చేతుల్లో ఉంచుకోండి".... పైకెక్కినతను వేప మండల్ని తుంచేయసాగాడు.

లావణ్యకు చిర్రున కోపం వచ్చింది. వాళ్ళని మింగేసేలా వురిమి చూచింది. అందరు జడుసుకునేలా.... చూడటంతో వులిక్కిపడ్డారు.

తన చీర చింపి నాగార్జున నుదిటికి కట్టు కట్టింది. "చూశావా మల్లిగా మనుషులయితే అంత మంచి కోకలు చింపుతారా.... నిజంగా ఇవి గాలి చేష్టలే...."

"ఎందుకు చింపరు.... సినిమాల్లో చింపటం లేదా....?" ఒక కుర్రాడి జవాబు.

ఆ గోలకు అక్కడే కొంచెం దూరంలో వున్న స్కూల్లో పాఠాలు చెపుతున్న మాస్టరు అక్కడకు వచ్చాడు. అక్కడ జరుగుతున్న వింతను చూచి ఆశ్చర్యపోయాడు.

"అరె... రే ఎంత పని చేస్తున్నారీ పల్లెటూరి మూక" అని అడగబోయి నోరావళించి వుండిపోయాడు రెండు క్షణాలు. కొంచెం కూడ మార్పులేని మనుషులు... అవే రూపాలో... ఇదెలా సాధ్యం... అనుకుని... "ఎవరు బాబు మీరు?" అనడిగాడు.

"మాష్టారు... నమస్కారమండి... నేనే రాదోని..." అంది లావణ్య.

లావణ్య మాష్టారికి నమస్కరించింది.

"ఎవరమ్మా... మీరు అచ్చం రాధాక్రిష్ణులు మాదిరే వున్నారు ?"

విడూరమయిన నిజాన్ని ఆయన విశ్వసించలేక పోతున్నాడు. వాళ్ళిద్దరిని కారెక్కమని చెప్పి... దారెటో ఇంటి కెటు వెళ్ళాలో చెప్పాడు.

"మాష్టారు... నాకింకా అంతా గుర్తుందండీ...." చెప్పింది లావణ్య.

ఆయన ఆశ్చర్యంగా చూస్తూ వున్నాడు. కారు కదలిపోయింది.

"ఇక్కడే ఇంత తతంగం అయింది. ఇక అసలు మనుషులు చూస్తె ఇంకెలా వుంటుందో" అన్నాడు నాగార్జున.

"అదీ... చూద్దాంగా..," అంది లావణ్య.

## 71

నేలమీద రాగులు ఎండలో ఆరపోసి వున్నాయి. ఒక పొడుగాటి కర్ర చేత పుచ్చుకుని, కూర్చుని, కాపలా కాస్తోంది ఒక ముసలామె. తలంతా తెల్లగా నెరసిపోయింది. ఒంటి మీద అక్కడక్కడ కాలిన మచ్చ లున్నాయి. నీలంరంగు ముతక నేత చీర ఒంటికి చుట్టుకుని ఉంది. చేయెత్తి కాకులను తరిమినప్పుడల్లా పల్చ బడిన ఆమె చేతి క్రింద చర్మం కదులుతోంది.

దెయ్యాలుంటాయని ఆమెకు నమ్మకముంది గాని, తన కూతురు దెయ్యం రూపంలో రాదని గట్టి నమ్మకం. అందుకే ఆమె ఏమీ జంకు లేకుండా చూస్తోంది.

లావణ్య దగ్గరగా వచ్చేసింది. ఆమె చూపు అలాగే వుంది.

"అమ్మా ! అలా చూస్తావేమ్మా నేను రాధోని..."

"ప్లీజ్, లావణ్యా ఏమి మాట్లాడ వద్దు. పెద్దావిడకు సడన్‌గా షాక్ తగలవచ్చు..." అన్నాడు నాగార్జున ఆమెకు అర్థం కాకుండా వుండేందుకు ఇంగ్లీషులో.

ఏదో చెప్పాలనుకున్న లావణ్య... డాక్టర్ నాగార్జున సలహాతో ఆగి, తల్లిని పరికించి చూడసాగింది.

ఒక యువతి చంకలో కుండ పట్టు కుని నీళ్ళు తెస్తూ ఆ ముసలామె దగ్గిర వున్న వాళ్ళను చూచి... చంకలో కుండను దబ్బున క్రింద పడేసి, గుండెల మీద చేతులుంచుకొని రొప్పుతూ నిలుచుండిపోయింది... కొన్ని నిమిషాలు... తర్వాత తేరుకుని "అయ్యో... ఏమయ్యో... ఇలా వస్తావా .... వేగం రా" అని కేక పెట్టింది.

ఒకకాలు.... ఇంకొక కాలుకు బదులు కర్ర ఆసరాగా పట్టుకుని గబ గబ నడిచి వచ్చాడు నలభై అయిదేళ్ళ పైన పడ్డ వ్యక్తి.

ఆ వచ్చిన ఇద్దర్ని చూసి.... అందరిలాంటి పరిస్థితి ఎదురైనప్ప టికీ, నిబ్బరంగా నిలబడి.... "ఎవరు బాబు మీరు.... ఎవరి కోసం వచ్చారు ?" .... అనడిగాడు నమ్రతగా.

"అన్నయ్యా - నేను రాధని"... అంది లావణ్య ఆనందంగా.

"నాకంత అదృష్టం ఎక్కడిదమ్మా ....మా రాధ... ఎప్పుడో పోయింది."

"జ్ లావణ్య... సడన్‌గా అందరితో అలా చెప్పకు" అన్నాడు నాగార్జున మందలింపుగా.

"మీతో కొంచెం మాట్లాడాలి... మీ పేరు...." అడిగాడు నాగార్జున.

"రంగయ్య" చటుక్కున పేరు చెప్పింది లావణ్య.

అందరూ ఒక్కసారిగా ఆమె వైపు, ప్రపంచంలోని ఎనిమిదో వింతని చూచినట్లు చూశారు.

"నా పేరు మీకెలా తెలుసమ్మా!" ప్రశ్నించాడు రంగయ్య.

"అన్నయ్యా.... నీ పేరు తెలియదా? నాకు వదిన పేరు కూడ తెలుసు.... రంగమణి.... అమ్మపేరు ముత్యాలమ్మ."

అదే సమయంలో ఒక పద్దెనిమిదేళ్ళ యువతి అక్కడకు.... వచ్చి వాళ్ళ సంభాషణ వింది. వెంటనే ఆమెకు స్ఫురణ కలిగి.... రెండంగల్లో లోపలకెళ్ళి.... గోడకు తగిలించిన, ఒక చిన్న సైజ్ ఫోటో తెచ్చి.... ఆఫోటోలో వున్న ఆమెను.... ఇక్కడ ప్రత్యక్షమైన ఈమెను మార్చి, మార్చి చూసింది. ఆమె ఈమె ఒకేపోలిక. ఇది పునర్జన్మ కేసని గ్రహించి.... లావణ్య దగ్గరగా వచ్చి.... "మరి నేను.... నా పేరు గుర్తుందా" అనడిగింది.

లావణ్య ఆమె ముఖంలోకి తేరి పార చూచి, తెలియదన్నట్లు పెదవి విరిచింది.

అవును, నేను మీకు తెలియదు. నేను మీ తర్వాత పుట్టాను. మీ పేరు నాకు పెట్టేరు. అప్పుడా ఇంత కాలానికి పూర్వ జన్మ గుర్తు కొచ్చిందా? ఎలా వచ్చింది.? ఈ వూర్లో వున్నట్లు ఎలా తెలిసింది? మమ్మలందర్ని ఎలా గుర్తు పట్ట గలిగారు?" - ప్రశ్న మీద ప్రశ్న వేస్తూనే వుంచా అమ్మాయి.

నాగార్జున కలుగచేసుకుని, "మిస్ లావణ్య చాలా అలసి పోయి వున్నారు. మీ ప్రశ్నలన్నింటికి బదులు ఆమె నిదానంగా చెప్తుతారు. ఏమీ అనుకోవద్దు" అని చెప్పాడు. అతనికి భయంగానే వుంది. ఎక్కడ ఎక్కువ ఒత్తిడి అయితే ఆమెకు స్పృహ పోతుందో అని.

"అన్నయ్యా" అని అతని కాళ్ళకు నమస్కరించింది లావణ్య. అనుకోని ఆ పరిణామానికి రంగయ్య చకితుడయ్యాడు.

నులక మంచం తెచ్చివేసి... దాని మీద దుప్పటి పరచి కూర్చోమని చెప్పింది రంగమణి.

నాగార్జున కూర్చుని.... రంగయ్యను పక్కన కూర్చోమన్నాడు.

చేతులు కట్టుకుని ఒంటి కాలు మీద సమ్రతతో నిలుచున్న రంగయ్య "వద్దు బాబు గోరు.... మీరు కూర్చోండి" అని చెప్పాడు.

"ఫర్వాలేదు.... కూర్చో...." అని రంగయ్యను కూర్చోబెట్టాడు.

ఇదంతా చూస్తుంటే రంగయ్యకు ఎంతో సంబరంగా వుంది.

లావణ్య తల్లి దగ్గరగా కూర్చుని .... ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని తడిమింది.

రంగమణి స్టీలు గ్లాసుతో మజ్జిగ తెచ్చింది.

అది చూసిన లావణ్య నవ్వుకుంది. అప్పటికి, ఇప్పటికి .. ఇదా వ్యత్యాసం ఆ రోజుల్లో కంచుగ్లాసుతో తాగేవారు, ఇప్పుడు స్టీలు గ్లాసులు. ఇదొక్కటే మార్పా వీళ్ళ జీవితాల్లో ?

లావణ్య ముఖంలోని ఆవేశాన్ని గమనించిన రంగమణి, ముత్యాలమ్మ జడిసిపోయారు.

"ఏమిటి బిడ్డా.... అలా మారిపోయావు.... ఎందుకంత ఆవేశం.... ?"

"అమ్మా ! ఆ దుర్మార్గుడు ఇంకా బ్రతికే వున్నాడా.... ?"

"ఎవరమ్మా"

"అదే.... క్రిష్ట వాళ్ళ నాన్న కోదండం."

"ఆత్రపడకు బిడ్డా .. ఓరికర్మ ఆరికే ఎరుక. అంతముదనష్టపు పనిచేసిన ఆడు ఏమి బాగుబడ్డాడు ? పొలాలన్ని కొట్టుకు .. పోయి, తుఫానికి ఇళ్ళుకూలి పోయి . వున్నకొడుకులు ముఖాన ఉప్పు నీళ్లయినా చల్లక, కుంటికాలు... కుంటి చేత్తో మంచాన పడున్నాడు." ముత్యాలమ్మ చెప్పే మాటల్ని నాగార్జున కూడ వింటున్నాడు. కాని, ఇదంతా అయోమయం. పోయిన జన్మలో క్రిష్ణ అనే వ్యక్తి రూపాన్ని తను పొందివున్నాడా ? మనుష్యుల్లో కనుముక్కుతీరు అరవైమూడు తరహాలకు మించి వుండదని ఈ పామరులకి తెలియదు.

"లావణ్యా, రిలాక్స్ అవు.... తగవుకీ... కోపతాపాలకి ఇది సమయం కాదు."

"అమ్మా మీరక్కడకు వెళ్ళటం మంచిది కాదమ్మ అసలే వాళు చాలా కర్కోటకులు" అని చెప్పాడ రంగయ్య.

ఎందరు ఏమి చెప్పినా లావణ వినే స్థితిలో లేదు. వెళ్ళాలి వాళ్ళన చూడాలి - అనే పట్టుదలతో పిడికిళ బిగుసుకున్నాయి.

"డాకర్, ప్లీజ్, మీరు నాకెంత హెల్ప్ చేశారు. ఈ ఒక్క విషయంల కూడ నాతో సహకరించండి. నేన వాళ్ళతో తగవులాటకు కాదు వెళ్ళ లనుకునేది. హుందాగా వాళ్ళముంద తలెత్తుకు నుంచోవాలని ప్లీజ్.. వెళ్దాం రండి, డాక్టర్."

"కుశలీ... నాకేమి అభ్యంతర లేదు కాని... నీక్షేమం నా మీ ఆధారపడి వున్నవి. మీ డాడీ వెంక నమ్మకాలతో నా వెంట పంపా సేఫ్‌గా ఆయనకి ఒప్పచెప్పటం ధర్మం... నా కర్తవ్యం. అక్కడికెళ వాళ్ళు చూపే నిర్లక్ష్య ధోరణికి కండిషన్ ఏమైనా అయితే ?"

"డోంట్ వర్రీ, డాక్టర్.... నా కేమీ కాదు. నాలోని ఈ అలజడే కావచ్చు అలా స్పృహ పోయేందుకు కారణం...నాకింకేమీ కాదు."

అప్పటికి వూరి జనమంతా వచ్చి ఏమిగూడి చూడసాగారు. రంగయ్య ఃనాన్ని తొలగించి దారి తీశాడు. ంతవరకు దయ్యాలనుకుని భయ ండిన జనం, వీళ్ళని అద్భుత వ్యక్తు ులగా చూడసాగారు. ఆ జనంలోంచి లాగో కారు మెల్లగా కదలిపోయింది.

కోదండం ఇంటి ముందు ారాగింది.

పేడలో కాళ్ళు పెట్టి తొక్కుతున్న ాలేరు కారులో నుండి దిగిన ాళ్ళను చూచి, అమాంతం కూర్చుండి ోయాడు.

అవులకు గడ్డి వేస్తున్న పెద్ద ాలేరు చేతిలోవున్న గడ్డిని, బిగిసి ట్టుకుని లోనికి గెంతేడు.

అక్కడే పాల గిన్నెలు కడుగు న్న పనిమనిషి పాపాయి వాళ్ళను ాచి అలాగే చతికిలబడి కూర్చుండి యింది.

అప్పుడే వరండాలో కొచ్చిన దండం పెద్దకొడుకు పేరయ్యకు.... ులు వుండ చుట్టుకుపోయాయి. ిచ్చిన వార్త వూరంతా పుకార్లై, వ పాలేరు చెవిలో వేశాడు, కానీ, వే రూపాలతో ప్రత్యక్షమైన ళ్ళను చూడటం ఆయన వూహ దని నిజం అయింది.

లావణ్య అతని వైపు సవాల్‌గా చూస్తోంది,

నాగార్జున పైకి మామూలుగా వున్నప్పటికీ 'ఈ సాహసం ఎందుకు చేశానా?' అని విచారిస్తున్నాడు.

పేరయ్య, అతని తమ్ముడు తిమ్మ య్య బయటకు వచ్చారు. గుండె నిబ్బ రం గల తిమ్మయ్య అచ్చుపోసినట్లున్న వాళ్ళను చూచి తూలిపోయే స్థితి కొచ్చాడు.

కొద్దిక్షణాల భయంకర నిశ్శబ్దం తర్వాత....లావణ్య మెట్లమీద కాలు పెట్టింది. కాలి మువ్వలేవో ఆ సోదరుల చెవులో గింగురమన్నాయి.

ఆమె రెండోకాలు కూడా పెట్టింది.

"ఎక్కడి కొస్తున్నావ్?" - క్రోధం నిండిన కంఠంతో ప్రశ్నించాడు పేరయ్య.

చిన్న పాలేరు నిలువెల్లా వణికి పోయాడు. లోపల ఆడవాళ్ళు వాకి ట్లోకి వచ్చి, గుమ్మం దాటి రావటం వారి జన్మహక్కు కాదని, ముఖాలు మాత్రమే బయట పెట్టి తొంగి చూస్తు న్నారు.

నిర్లక్ష్యంగా మెట్లన్నీ ఎక్కేసింది లావణ్య.

"ఏమిటి చెప్తూవుంటే అలా వస్తు న్నావ్ లోపలకి - ఆగక్కడ"....

"మీ అరుపులకు జడిసేందుకు ఆ నాటి రాణి(?)యిని కాదు."

"అయితే మీరు పగటి వేష గాళ్లన్న మాట" అన్నాడు.

"అవును, అన్నా.... మన విష యాల్ని సేకరించి.... మనల్ని దబా యించ వచ్చిన పట్నపు వేషగాళ్లే అయివుంటారు. ఈ పల్లెవాళ్ళు వీళ్ళను చూచి దెయ్యాలని తలుస్తున్నారు. కాని, వీళ్ళు దెయ్యాలు కారు - మాయ దార్లు."

"పగటి వేషధార్లం మేము కాదు మీరు.... అమాయకపు ప్రజల ప్రాణాలు తీసే మీరే మాయగాళ్లు."

"మెడబట్టి బయటకి.... గెంటే యం(డ్రా" అని పాలేరుతో చెప్పాడు పేరయ్య.

అంతవరకు నిశ్శబ్దంగా వున్న నాగార్జున కలుగ చేసుకుని... "మీకో అవసరం లేదు.... మీరు చేసే దారు ణాలు సహించేందుకు, ఈ వూరి అమాయక ప్రజలంకాదు... ఐ యామ్ డాక్టర్ నాగార్జున; షి ఈజ్ మిస్ లావణ్య, ఒక కోటీశ్వరుడి ఏకైక పుత్రిక. ఆమె పూర్వజన్మ గుర్తుల ఇన్వెష్టిగేషన్ కోసం ఈ వూరు వచ్చాం. అంతే గాని, మీ ఆస్తులు, డబ్బు కొరకు కాదు."

"డాక్టర్ వీళ్ళింత సులువుగా వినే మనుషులను కుంటున్నారా? .... వీళ్లైతే మనిద్దర్ని కూడ మింగేయ గలరు" - అంది లావణ్య.

"సినిమాలు చూచి, బాగా వంట పట్టించుకున్నట్టున్నారు. సినిమాల్లో అయితే, ఇద్దరికీ గుర్తు వచ్చేది, ఇప్పుడు ఈవిడ గారొక్కర్తే కథ చెపుతోంది. ఆయన డాక్టరట" - వ్యం గ్యంగా అన్నాడు తిమ్మయ్య.

"యు.... ప్లీజ్.... కమ్, డాక్టర్" అంది లోపలకు వెళ్ళబోతూ లావణ్య.

"తమ్ముడూ వీళ్ళని ఇక్కడే ఆపె య్యరా.... లోపలకు పోనియ్యకు" అని చెప్పాడు పేరయ్య.

"ఏమిటి మీ దౌర్జన్యం.... మా నాన్నగారిని.... కలువకూడదంటే.... అలా వెళతారేమిటి.... పోలీసులను పిలిపించమంటారా....?"

"మీకు తెలియదేమో.... మాకు సాయంగా మా వెనుకనే ఉన్నారు మఫ్టిలో...." అన్నాడు నాగార్జున.

ఆనాటి రాదోకి, ఈనాటి ఈమెకు కంఠస్వరంలో కూడా ఏమి మార్పు లేదు. కాకుంటే ఆమె స్వరంలో నమ్రత; ఈమె స్వరంలో తీవ్రత.... అంతే! ఏ చిన్న మార్పు కూడ వాళ్ళకు కనిపించలేదు.

వాళ్ళందరూ చూస్తూండగానే డాక్టర్ నాగార్జున చేతినందుకుని, లోపల కెళ్ళింది లావణ్య.

"ఎదురుగా గోడకు వేలాడుతున్న ఫోటోను చూపి 'మీ అమ్మగారు'" అంది లావణ్య.

ఆ ఫోటో దగ్గరగా వెళ్ళి చూశాడు. కాని, ఎటువంటి చలనమూ లేదు అతనిలో. ఆడవాళ్ళు కూడ లోపలున్న నాగార్జున వైపే ఆశ్చర్యంగా చూశారు. అచ్చం ఆనాటి తమ మరిది పోలికే, ఇదెలా సాధ్యం? – అను కున్నారు ఇద్దరు తోటికోడళ్ళు.

"అమ్మా, నీవు అమ్మమట.... నా మి గుర్తులేదు. నీవెంత చల్లని ల్లివో! లావణ్య నన్నుయిక్కడికి తీసు 'చ్చి చూపిస్తుంటే, ఇదొక వింత నుభూతి అనిపిస్తోంది" అన్నాడు నాగార్జున.

"ఈమె మీ పెద్ద వదినగారు- పేరు మహాలక్ష్మి.... మీ పెద్దన్న పేరయ్య గారి భార్య. ఇక మీ నాన్నగారిని చూద్దాం" - అంది లావణ్య డెబ్బయి ఏళ్ళు దాటిన వ్యక్తి, ఆజానుబాహుడు; ముఖంలో అధికారంతో కూడిన దర్పం. అయితే కాలూ చెయ్యి ఆడక మంచంలో పడివున్నాడాయన. వీళ్ళు వచ్చినట్టు ఆయన చెవిన పడిందేమో, వాళ్ళకొరకు ఎదురు.... చూస్తు నట్టున్నాడు. వాళ్ళను చూసి ఆయన కళ్ళు చెమర్చాయి.

నాగార్జున ఎవరైనా కావచ్చుకాని, చనిపోయిన తన కొడుకు రూపాన్ని బోలివచ్చినవాడు. తన కొడుకు నిజంగా తిరిగి వచ్చినంత సంతోష పడిపోయాడు. కుడిచేయి లేవదు. ఎడమచేతిని పైకెత్తి రమ్మని సైగ చేశాడు.

నాగార్జున దగ్గరగా వెళ్ళాడు.

అతన్ని తనవి తీరా చూస్తూ.... "నేనెన్నడూ అనుకోలేదు. డాక్టరు చది వించిన కొడుకుని అలా పోగొట్టు కుంటానని" అన్నాడు కోదండం నిరాశగా.

"మీకొడుకు గురించే ఆలోచిస్తు న్నారు - రంగయ్య మాట?"

"అవును బాబు... తప్పు చేసే టప్పుడు, చేయించేప్పుడూ, తెలియని మర్మం జరిగిపోయాక కళ్ళు తెరుపులకి వస్తాయి. కళ్ళకావరం, అహంకారం ఎన్నో దారుణాలు చేయించింది. దాని ఫలితమే ఈ స్థితి"

ఎంతో ఆవేశంతో వచ్చిన లావణ్య ఆయన మాటలు విని చల్లబడింది. ఆమె మనసు తేలికయింది.

"పగటి వేషదార్లు మా ఇంటిలో జొరబడి మా నాన్నను వలలో వేసు కోవాలని చూస్తున్నారా?" - వ్యం గ్యంగా అడిగాడు అప్పుడే అక్కడ కొచ్చిన పేరయ్య.

"ఇప్పుడు తెలుసుద్ది.... పూర్వజన్మ సుకృతం" - అన్నాడు హేళనగా తిమ్మయ్య వాళ్ళవెనుక నలుగురు రౌడీలు కర్రలు చేత పుచ్చుకొని నిల బడి వున్నారు.

కాఫీ ఫలహారాలతో అక్కడకు వచ్చి పరిస్థితిని అర్థం చేసుకున్న మహాలక్ష్మి వాళ్ళకి అడ్డుగా వచ్చి నిలబడింది.

"ఇంత ఘోరం చేసి.... మళ్ళీ పాపం వడి కట్టుకోవద్దు. ఆ పుణ్య ప్రేమికులను మళ్ళీ విడదీయవద్దు. ఆ నాడు చేసిన పాపమే ఇంకా వెంటాడు తోంది."

ఎన్నడూ పెదవి విప్పని ఆ మహా ఇల్లాలి ఆర్తనాదాలకు అందరూ అచేతనులై పోయారు.

(ఇంకా వుంది

JAGATI Telugu Monthly ... Edited, Printed and Published by NR Chendur at MANASA PRESS, No 2 Kutchery Road, Mylapore, Madras 600 004